# అద్భుత వ్యక్తి

# ల్యారీ బ్రిలియంట్ / సుబ్రహ్మాణ్యము



శ్రవణరూపం- కిరణ్ ప్రభ

పఠనరూపం- పెద్ది సాంబశివరావు

విస్తరణ రూపం – దేవినేని సీతారావమ్మ ట్రస్ట్

# అద్భుత వ్యక్తి

# ల్యారీ బ్రిలియంట్ / సుబ్రహ్మణ్యము



శ్రవణరూపం- కిరణ్ ప్రభ

పఠనరూపం- పెద్ది సాంబశివరావు

విస్తరణ రూపం – దేవినేని సీతారావమ్మ ట్రస్ట్

**ఏమిటీ పుస్తకం?**

మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్, శాన్ ఫ్రాన్సిస్కో అంచున పసిఫిక్ మహాసముద్రంలో ఆల్కెట్రా ద్వీపం, 'దమ్ మారో దమ్, మిట్ జాయే హమ్, దునియానే దియా హై క్యా హమ్ కో' అని ప్రశ్నించిన హిప్పీలు, హిమాలయ పర్వత సానువుల్లో నీబ్ కరోలీ బాబా, భారతదేశంలో మశూచి వ్యాధి నిర్మూలన, నేపాల్ లో కంటి ఆపరేషన్లు, అమెరికా క్యాలిఫోర్నియా సిలికాన్ వ్యాలీ లో డాట్. కామ్ కంపెనీ, గూగుల్ ప్రారంభించిన ధార్మికసంస్థ, గూగుల్.ఆర్గ్, శ్రీలంకలో సునామీ, భారతదేశంలో పోలియో చుక్కల మందు, జీవితంలో ఒక్కసారయినా భారతదేశం చూడకపోతే చాలా కోల్పోయినట్లే అని గ్రహించిన ఈ-బే స్థాపకుడు స్కోల్, భారతదేశంలో మారుమూల పల్లెలు, కొండల్లో పర్యాటకులు, ఓ సుబ్రమణ్యం, ఓ గిరిజ.

ఒక హిప్పీ,ఒక డాక్టర్, ఒక టెక్నాలజిస్ట్, ఒక ఫిలాంత్రపిస్ట్, 40 ఏళ్ల క్రిందట ఇండియాలో మశూచిని పూర్తిగా నిర్మూలించడంలో కీలకపాత్ర పోషించిన వైద్యుడు, ప్రపంచాన్ని మార్చటమే కాదు ప్రపంచాన్ని రక్షించటం కూడా ముఖ్యమేనని నమ్మి, గత 50 సంవత్సరాలలో, ప్రతి దశాబ్దంలోనూ ప్రపంచ మానవాళి సంక్షేమం కోసం ఉద్దేశించబడిన ప్రణాళికల్లో కనీసం ఒక దానిలోనైనా క్రియాశీలకపాత్ర పోషించిన ఒక ఆసక్తికరమైన అద్భుతవ్యక్తి ల్యారీ బ్రిలియంట్. ఒకదానికొకటి పొంతనలేని విషయాలు.

కలికాలంలో పాపం పెరిగిపోతుంది. అన్యాయం, అక్రమాలు, స్వార్థం ఎక్కువై పోతున్నాయి. పక్కవాడిని తొక్కుకుంటూ వెళ్లటమే అభివృద్ధి అనుకుంటున్నాము, నిజమే. సామాజిక మాధ్యమాలలో ఇలాంటి వ్యాఖ్యానాలు సాధారణంగా చూస్తుంటాం. రోజూ కనిపించేవి మోసాలు, ద్వేషాలు, అవినీతి రాజకీయాలు, యుద్ధాలు, అశాంతి ఇవే కదా? ఇవన్నీ ఎక్కువగా ఉన్నమాట నిజమే.

కాని ఏ సమకాలీన, దేశంలోనైనా, సమాజంలోనైనా మంచి కూడా కావాల్సినంత ఉంటుంది. ఇలాంటి మంచివాళ్ల గురించి చెప్పుకుంటాము. సమకాలీన ప్రపంచంలో, సమాజంలో చాలామంది మానవజీవన ప్రమాణాలను మెరుగు పరచాలని నిరంతరం పరిశోధనలు చేస్తున్న శాస్త్రవేత్తలు ఉన్నారు. భయంకరవ్యాధులకు మెరుగైన చికిత్సా విధానాలకై కృషి చేస్తున్న నిపుణులు ఉన్నారు.

ఇంత మంచితనం కూడా ఇంకో వైపు ఉండబట్టే భూగోళం మీద ఏ కొద్ది సమతుల్యత అయినా కొనసాగుతుంది.
మానవజాతిని శిక్షించేవి, మానవజాతికి అత్యంత ప్రమాద మైనవి, మానవజాతిని మధ్యలోనే నిర్మూలించేవి మరికొన్ని ఉన్నాయి. అవే భయంకర అంటువ్యాధులు, సంక్రమణ వ్యాధులు. అంటే ఒకరి నుంచి మరొకరికి సోకేవి.

ఎక్కడో మొదలవుతుంది, ఏదో వైరస్. శరవేగంతో భూగోళం అంతా పాకి పోతుంది. వేలాది, లక్షలాదిమంది ప్రాణాలను బలి తీసుకుంటుంది.ఉదాహరణలు. ఒకప్పటి మశూచి, గత దశాబ్దంలో వ్యాపించిన బర్డ్ ఫ్లూ, సార్స్, ఎబోలా, ఇంకా చెప్పాలంటే ఇటీవలనే చైనాలో మొదలై, ప్రపంచాన్ని వణికిస్తున్న కరోనా (కోవిడ్-19).

ఇలాంటివి గత 30 సం.ల్లో 30కి పైగా వచ్చి ఎంతోమంది ప్రాణాలను బలిగొన్నాయని అంచనా. ఇలా వైరస్ ల ద్వారా వ్యాపించే వ్యాధులను ఎంత త్వరగా గుర్తిస్తే అంత త్వరగా అదుపు చేయగల అవకాశం ఉంటుంది. ఆ దిశలో అంటే ఇలాంటి భయంకర వ్యాధులను అత్యంత శీఘ్రంగా గుర్తించ గల విధానాలమీద, ప్రణాళికల మీద నిరంతరం పని చేసే సంస్థలు ఉన్నాయి. వాటికి అంకితమైన వ్యక్తులు ఉన్నారు. ఇలాంటి వాళ్ల గురించి, ఇలాంటి ప్రయత్నాల గురించి, మనం చాలా తక్కువగా వింటుంటాము.

అంటే ప్రపంచంలో విధ్వంసం ఎంత జరుగుతుందో మరో వైపు మానవాళి సంక్షేమం కోసం అన్ని ప్రయత్నాలు జరుగు తున్నాయి.



ఏ మనిషి జీవితంలోనైనా నమ్మకం అత్యంత ప్రముఖ పాత్ర పోషిస్తుంది. నమ్మకం అంటే ఎవరిమీద? కొందరికి దైవ భావన మీద, కొందరికి కొందరు ప్రత్యేక దేవుళ్లమీద, ఇంకా స్వామీజీలు, బాబాలు, ప్రవచనకారులు, మతపెద్దలు, సన్నిహిత మిత్రులు, మతగ్రంథాలలో వేటినైనా నమ్మవచ్చు.

వీటిలో ఏదీ తప్పు కాదు. ఎవరికైనా ఎవరి మీదైనా నమ్మకం ఉండొచ్చు. అయితే ఆ విశ్వాసం మూఢవిశ్వాసంగా మారి, దానినే ప్రపంచంలో ప్రచారం చేయటం, ఇతరుల విశ్వాసాలను అంగీకరించకపోవటంతోనే ఇబ్బందులు, ఘర్షణలు మొదలు అవుతాయి.

అలా కాక ఎవరిమీదనో మనకున్న విశ్వాసాలను ఆలంబనగా చేసుకొని, మనమీద మనకుండే నమ్మకంగా మార్చుకొని ఆత్మ విశ్వాసాన్ని, ఆత్మబలాన్ని పెంపొందించుకున్న రోజున మనిషి అద్భుతాలను చేయగలడు. ఆ మార్గంలో సమాజాన్ని ప్రయోజన కరంగా ప్రభావితం చేసే మనిషి తనను తాను, మహామనిషిగా

మార్చుకోగలడు. సుదీర్ఘ ఉపోద్ఘాతంతో, ఒకదానికొకటి సంబంధం లేని విషయాలు ఇవి. వీటన్నిటి కలయికను తన వ్యక్తిత్వంలో, జీవనమార్గంలో ఒక భాగంగా మలచుకున్న అద్భుతవ్యక్తి గురించి చదువుదాం.

**పరిచయం**

అది 1960 దశకం. అతని వయసు సుమారు 16 ఏళ్లు. చదువుకునే రోజుల్లోనే అమెరికాలో అల్పసంఖ్యాక వర్గాల (minorities) హక్కులకై ఉద్యమించిన ఉద్యమకారుడు. తర్వాత ఆయనొక డాక్టర్, హిప్పీ, సాంక్రమిక వ్యాధుల శాస్త్రజ్ఞుడు. హిందూ మతాన్ని విశ్వసించిన ఆధ్యాత్మిక వేత్త. మశూచిని, పోలియోను నిర్మూలించటానికి కృషి చేసిన బృందాలలో కీలక పాత్రధారి.

ప్రపంచంలో కంప్యూటర్ ఆవిష్కరణలో అగ్రగామి, అంధత్వ నిర్మూలనకు బృహత్తర కార్యక్రమాలను దశాబ్దాలుగా అమలుచేస్తున్న ఒక వ్యక్తి, ఒక శక్తి, ఇలా ఆయన ఇంకా చాలా, చాలా...

ఈయన అసలు పేరు లారెన్స్/ ల్యారీ బ్రిలియంట్. బ్రిలియంట్ ఇంటిపేరు. బ్రిలియంట్ అంటే నిఘంటు అర్థం మేధావి, ప్రకాశించేవాడు, కాంతులు పంచేవాడు అని చాలా రకాలుగా అన్వయాలు చెప్పుకోవచ్చు. ఆ ఇంటిపేరును సార్థకం చేసుకొని 76 సంవత్సరాల వయసులో ప్రస్తుతం ప్రశాంతంగా డెట్రాయిట్ లో జీవనం సాగిస్తున్న డాక్టర్ ల్యారీ బ్రిలియంట్ సంక్షిప్త జీవితమే ఈ పుస్తకం.

ల్యారీ గత నాలుగైదు దశాబ్దాలలో శుభప్రభావాలను చూపిన అనేక అంశాలలో కనీసం ఒక్క దానిలోనైనా భాగస్వామి. ల్యారీ సంక్షిప్త జీవితం తెలుసుకుంటే ఉత్కంఠభరిత జీవితం అర్థం అవుతుంది.

ల్యారీ స్వస్థలము అమెరికాలో, పశ్చిమతీరంలో గల మిషిగాన్ రాష్ట్రంలోని డెట్రాయిట్. వాళ్ల కుటుంబం చాలా కాలం క్రితమే రష్యా నుంచి వలస వచ్చింది. ల్యారీ తాత రష్యా పక్కన ఉండే బేలూ రష్యా నుంచి అమెరికాలోని డెట్రాయిట్ కు వలస వచ్చాడు.

ఇక్కడకు వచ్చినపుడు ల్యారీ నాన్నకు 7 సం.రాల వయసు. వారు యూదులు. ఆయన డెట్రాయిట్ వీధుల్లో పెరిగాడు. ఆ రోజుల్లో వారికి జీవితంలో ప్రతిరోజూ ఒక పోరాటంలాగా నడిచేది. ల్యారీ తండ్రి బడికి అషామాషిగా వెళ్లాడు. 10, 12 సంవత్సరాలు వచ్చేసరికి అది కూడా మానేశాడు. లాటరీ టికెట్లు అమ్మేవాడు.

అక్కడ వీధుల్లో ముఠాల ఆధిపత్య పోరాటాలు నిత్యకృత్యాలు. అలాంటి ముఠాల మధ్య బ్రతికి బట్టకట్టాలంటే ఎవరైనా అందుకు తగ్గట్లు పెరగాలి. ల్యారీ నాన్న ముష్టి యుద్ధం (boxing) నేర్చు కున్నాడు. చదువు లేనందున చిల్లర మల్లర వ్యాపారాలు చేస్తూ పెరిగాడు. ఆత్మరక్షణకు ఇంట్లో ఎప్పుడూ రివాల్వర్ సిద్ధంగా ఉంచుకునేవాడు.

తండ్రికి చాలా ఆలస్యంగా 42 వ యేట1944 మే నెల 5 తేదిన ల్యారీ బ్రిలియంట్ జన్మించాడు. ఆ తరువాత మూడేళ్లకు తమ్ముడు బ్యారీ బ్రిలియంట్ జన్మించాడు. పిల్లలు పెరిగి పెద్ద కాసాగారు. నాన్న హోటళ్ల దగ్గర కాయిన్ బాక్సులు ఉంచి, ఆ ఆదాయంతో జీవనం గడిపేవాడు.ఆ పెట్టెలో డబ్బునాణెం వేస్తే కోరుకున్న పాట వినిపించేది. అక్కడకు వెళ్లి ఆ నాణేలు వసూలు చేసుకునేవాడు. ఆదాయం బాగానే వచ్చేది.

కాని మాఫియా ముఠాలు ఆయన్ను బెదిరించేవి. యంత్రాలు అన్నిటినీ మాకు ఇచ్చేయ్. లేకపోతే నీ పిల్లల్ని ఎత్తుకు పోతాం' అని భయపెట్టారు.
ల్యారీ నాన్న లొంగక పోయేసరికి యంత్రాలను తగలబెట్టారు, కంపెనీ మేనేజరును చంపారు. చేసేది ఏమీ లేక కష్టాల పాలు అయింది వారి కుటుంబం.

చదువులేనందున తాను పడుతున్న కష్టాలు కళ్లముందుంటే చూస్తూ, అలాంటి దయనీయ పరిస్థితులు తన పిల్లలకు రాకూడదని కోరుకునే వాడు.

ల్యారీని చదువుకు డెట్రాయిట్ కు 40 మైళ్ల దూరంలోని పట్టణానికి పంపించారు. ల్యారీ లెక్కల్లో చాలా చురుకుగా ఉండేవాడు.
ల్యారీ కాలేజి చదువుకు వచ్చే సరికి వాళ్ల నాన్న మ్యూజిక్ కంపెనీ మూతపడిపోయింది. సంపాదన లేదు.చిన్నచిన్న పనిముట్లు బాగుచేసే వాడు. *తన పిల్లలు తనలాగా కాకూడదనే తపన ప్రతి అడుగులో కనిపించేది.* పిల్లలు హైస్కూలు చదువు పూర్తి చేశారు. ల్యారీ కాలేజిలో చదువు కొనసాగిస్తూ, సెలవుల్లో ఇంటికి వచ్చాడొకసారి.

అప్పుడు ల్యారీకి తెలిసింది నాన్నకు ఆరోగ్యం బాగాలేదు.పెద్ద కొడుకును దగ్గరకు పిలుచుకొని, కంటతడి పెడుతూ, 'నేను మీ కోసం ఏమీ దాచలేకపోయాను. ఆరోగ్యం ఇలా అయింది. నేను చనిపోతానని భయం లేదు, నువ్వూ, తమ్ముడూ ఎలా బ్రతుకు తారోనని నా భయం. చదువులేక నేను పడిన ఇబ్బందులు నువ్వు చూశావు కదా? మీరైనా గౌరవప్రదంగా బ్రతకండి. మీరు చదువులు మానవద్దు', అని చెప్పాడు. *తన కొడుకు గౌరవ ప్రదంగా జీవించటమే కాకుండా, తరువాతి జీవితంలో ప్రపంచ ప్రజలంతా గౌరవంగా బ్రతకటానికి ప్రయత్నించాడు.* ల్యారీ గొప్ప తనాన్ని అతని తండ్రి కూడా ఆరోజు ఊహించలేదు. కొడుకు వైభవాన్ని చూసే అవకాశం తండ్రికి కలగలేదు.

ఇలా నాన్న చెప్పిన మరుసటి రోజు ఒక సంఘటన జరిగింది. ల్యారీ గదిలో కూర్చొని చదువుకుంటున్నాడు. స్నానాలగది నుంచి వాళ్ల నాన్న పెద్దగా కేకవేశాడు. ల్యారీ వెళ్లి చూశాడు. వాళ్ల నాన్న గదిలో నేలమీద పడి, బాధతో గిలగిల కొట్టుకుంటున్నాడు. బట్టల్లో మలమూత్రాలు అయ్యాయి. అది శుభ్రం చేయమని ఏడుస్తున్నాడు. ఏదైనా

గుడ్డ తేవాలని చూస్తున్నాడు ల్యారీ. 'నువ్వు ఏదో తెచ్చేదాకా నేను బాధ భరించలేను. నీకేది అందుబాటులో ఉంటే దానితో పని చేయి' అన్నాడు నాన్న.

నాన్నను లేపి వైద్యుని వద్దకు తీసుకువెళ్లారు. ఆయనకు క్యాన్సరు వ్యాధి అని, మరో ఏడాదికంటే ఎక్కువ కాలం జీవించక పోవచ్చునని చెప్పారు. ఒకరోజు ల్యారీని పిలిచి వాళ్ల నాన్న జాగ్రత్తలు చెప్పాడు. అలా దిగులుతోనే బరువెక్కిన హృదయంతో కాలేజికి 1962 లో వెళ్లాడు.



నాన్న మాటలు ల్యారీపై జీవితాంతము ప్రభావము చూపాయి. ఏ ప్రణాళిక చేపట్టినా, అందుబాటులో గల వనరులతో ఏమి చేయ గలనా? అని ఆలోచించేవాడు.
ఆ రోజుల్లో అమెరికాలో మైనారిటీ వర్గాల హక్కులు, పౌర హక్కుల కోసం పోరాడుతున్న ఒక వ్యక్తి, మహాత్మాగాంధీ సిద్ధాంతాలచే ప్రభావితుడై , అమెరికాలో మానవహక్కుల కోసం, ముఖ్యంగా మైనారిటీల హక్కులకోసం అహింసా ఉద్యమాలు చేస్తున్నాడు. ఆయనే ***మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్***. ఆయన ఒకసారి విద్యార్థులను అందరినీ ఉద్దేశించి ప్రసంగించటానికి ల్యారీ చదివే కళాశాలకు వచ్చాడు. అక్కడి హాలులో రెండువేల మంది దాకా కూర్చునే వీలుంది. కాని కేవలం 50-60 మంది మాత్రమే వచ్చారు. మార్టిన్ ఏమీ నిరాశ చెందకుండా, వచ్చిన వాళ్లనందరినీ వేదిక పైకి రమ్మని ఆహ్వానించాడు. 'రండి, పైకి రండి, దగ్గరగా ఉండి మాట్లాడుకుందాం' అన్నాడు.

'ఈ ప్రపంచం ఒక వృత్తంలో చాపము వంటిది. చాలా మంది దాన్ని తమవైపుకు, తమ స్వార్ధ ప్రయోజనాల వైపుకు వంచు కోవాలని ప్రయత్నిస్తుంటారు. మనం మాత్రము ఈ చాపాన్ని న్యాయమార్గం వైపుకు వంచటానికి ప్రయత్నించాలి. ఉద్యమం హింసాపూరితం కానవసరం లేదు. ద్వేషంతో కాకుండా ప్రేమతో కూడా మనం చాలా సాధించవచ్చు' నని ప్రబోధించాడు.



ఈ మాటలు ల్యారీని బాగా ఆలోచింపజేశాయి. ఆ ప్రభావంతో పౌరహక్కుల కోసం ఉద్యమిస్తున్న సంస్థలో కార్యకర్తగా చేరాడు. స్వచ్ఛందకార్యకర్తగా చేరి, ఉద్యమ ఊరేగింపుల్లో చురుకుగా పాల్గొనే వాడు. స్థానికంగానే కాకుండా బయట జరిగే సమావేశాలకు, ప్రదర్శనలకు కూడా హాజరయ్యేవాడు.

అలా కొన్ని సందర్భాలలో మార్టిన్ లూథర్ కింగ్ తో కలసి నిర్బంధంలోకి తీసుకోబడి జైలుకు వెళ్లిన సందర్భాలు కూడా ఉన్నాయి.

'మా నాన్న క్యాన్సరు వ్యాధితో బాధ పడుతుంటే నేను చూసి దిగులు పడ్డాను. కానీ, నాకంటే ఎక్కువగా బాధపడుతూ, తిండి, గుడ్డ కూడా లేకుండా అలమటిస్తున్నవారు ఎందరో ఉన్నారు. నేను వాళ్ల కోసం కష్టపడాలి' అనే ఆలోచన ఆయన మెదడులో

పడిపోయింది. దాదాపు ప్రతివారం చివర్లో ఇంటికి వెళ్లి అమ్మను, తమ్ముడిని చూసివచ్చేవాడు. ఇంటికి వెళ్లకపోతే ఉద్యమాలకు వేరే ప్రాంతాలకు వెళ్లే వాడు. శాన్ ఫ్రాన్సిస్కో లో పౌరహక్కుల సంస్థ ఊరేగింపులో పాల్గొన్నాడు. ఆ కార్యక్రమంలో చురుకుగా, క్రియా శీలకంగా ఉండటం వల్ల ల్యారీ వయసులో చిన్నవాడయినా, కీలక వ్యక్తిగా భావించి, గౌరవించేవాళ్లు.

ఆ రోజుల్లో, అప్పుడు ల్యారీ విన్న మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్ ఉపన్యాసం ఆయనలో చాలా మార్పు తీసుకు వచ్చింది. ఇప్పటికీ ల్యారీ చెపుతుంటాడు. మా నాన్న నాకు చెప్పినమాటలు, మార్టిన్ ఉపన్యాసంలో సందేశాలు నాలోని మార్పులన్నిటికీ కారణం.

డాక్టరు వాళ్ల నాన్నకు ఇచ్చిన గడువు సమీపిస్తుంది. ఒకరోజు కాలేజిలో ఉండగా నాన్నకు ప్రమాదకరంగా ఉందని కబురు వచ్చింది. వెంటనే ఇంటికి వెళ్లాడు. నాన్న ప్రాణాలను నిలిపే మందులు పెట్టి ఉన్నాయి. డాక్టర్లు ల్యారీని అడిగారు. 'ల్యారీ మీ అమ్మగారు చాలా వత్తిడి, ఆందోళనలో ఉన్నారు, ఏ క్లిష్టమైన నిర్ణయాన్ని తీసుకోగల మానసిక స్థితిలో లేరు, మీ తమ్ముడు చిన్నవాడు, నువ్వు మేజర్ వు. నువ్వు సంతకం పెడితే ప్రాణాలను కాపాడే మందులను తీసివేస్తాము' అన్నారు. బరువెక్కిన హృదయంతో వాళ్ల నాన్న జీవితానికి వీడ్కోలు పత్రాల మీద సంతకం చేశాడు ల్యారీ.

నాన్న ప్రాణాలను నిలుపుతున్న మందులను నిలిపి వేశారు. అందరి కళ్లముందే నాన్న కన్ను మూశాడు.

మరుసటి రోజు కూతురును, మనుమళ్లను పరామర్శించటానికి ల్యారీ తాతగారు వచ్చాడు.. ల్యారీ మేడమీద ఉన్నాడు. తాతయ్య కింద ఉన్నాడు. ల్యారీ పైన చదువుకుంటున్నాడు. అతని దగ్గర కొత్త నాణెము ఒకటి ఉంది.

దానిని తాతకు చూపించాలనుకున్నాడు. ల్యారీ 'తాతా పైకి రా, నీకో నాణెము చూపిస్తా' అని పిలిచాడు. 'నేను రాలేనురా, నువ్వే రా,' అన్నాడు తాతయ్య. 'నువ్వే రా తాతయ్యా' అని రెండు, మూడు సార్లు గట్టిగా పిలిచాడు తాతయ్యను. తాతగారు ఆయాసపడుతూ, ఎక్కలేక ఎక్కుతూ పైకి వచ్చి నాణెం చూడటం, కూలబడటం ఒకేసారి జరిగాయి. కిందకు తీసుకువచ్చేసరికి ఊపిరి ఆగిపోయింది. ల్యారీ చాలా బాధపడ్డాడు. తన మూలంగా తాతయ్య చనిపోయాడని కుమిలిపోయాడు. ఇలా వారం రోజుల్లో ఇంట్లో ఇద్దరు పెద్దలు చనిపోయారు.

నాన్న చనిపోయేటప్పటికి వాళ్లకు ఇల్లు, కారు తప్ప వేరే ఏమీ లేవు. ఈ సంఘటనలతో ల్యారీకి చిన్న వయసులోనే ఒక తాత్విక చింతన కలిగింది. జీవితం, మరణం, బాధ, శోకం వీటన్నిటికి అర్థం ఏమిటి? ఏది దేనివల్ల వస్తుంది? అని ఆలోచిస్తూ తత్వశాస్త్ర పుస్తకాలు చదవసాగాడు. అతను కాలేజిలో తత్వశాస్త్రాన్నే ప్రధాన అంశంగా చదివాడు.
ఇలా చదువుతున్నప్పటికీ, వాళ్ల నాన్న చెప్పిన మాటలు ల్యారీ చెవుల్లో మార్మోగుతున్నాయి. సరైన చదువే నీకు గౌరవం ఇస్తుంది.

అమ్మతో చెప్పాడు. అమ్మా, నా చదువుకు డబ్బు నేనే సంపాదించుకుంటాను, మెడిసిన్ చదువుతాను.

నాన్న క్యాన్సరుతో మరణించాడు. అలాంటి వారికి నేను సేవ చేయాలి, అని అమ్మను ఒప్పించి స్వంత పట్టణంలోనే వైద్య కళాశాలలో చేరాడు.

కాలేజిలో చురుకుగా ఉండటం వల్ల పక్క పిల్లలకు ట్యూషన్లు చెప్పి కాస్త సంపాదించుకునే వాడు. కాలేజీలో కాఫీ, టీ వెండింగ్ యంత్రాలను అద్దెకు ఇస్తారు. వాటిని తీసుకొని నడిపి మరి నాలుగు రాళ్లు సంపాదించేవాడు. చురుకైన వాడు గనుక

వైద్యవిద్య అతనికి కష్టం అనిపించలేదు. 'అమెరికా వియత్నామ్ మీద యుద్ధం చేయటం తప్పు' అని బహిరంగంగా విమర్శించేవాడు ల్యారీ. ఆయన చదివే కళాశాలలో బాడీ పొలిటికల్ అనే విద్యార్థి రాజకీయ పత్రిక ఒకదానిని నడిపే వాళ్లు. ల్యారీ దానికి సంపాదకుడు కూడా.

మెడిసన్ చివరి సంవత్సరం చదువు విద్యార్థి తాను చదివే కళాశాలలో గాక ఇతర కళాశాలలో చదవాలి.

అందుకు ల్యారీ లండన్ వెళ్లాడు. యూరప్ లో వైద్య విద్య, వైద్యంపై సంక్షిప్త అధ్యయనం చేసి తిరిగి అమెరికా వచ్చాడు.

కాలేజీలో సహవిద్యార్థిని ఎలయిన్ తో, చూపులు, మనసులు కలిశాయి. ఆమె ల్యారీకి పాఠశాలలో చదువుకునే టప్పుడే తెలుసు. చదువు పూర్తికాక మునుపే పెళ్లి చేసుకున్నారు. 1969 ప్రాంతాల్లో ప్రారంభమైన వాళ్ల దాంపత్య జీవితం ఇప్పటికీ బలీయంగా కొనసాగుతుంది. అంతే కాదు, ల్యారీ చేపట్టిన ప్రతిపనిలో భార్య పాత్ర ప్రముఖంగా ఉంది. ఒక సమయంలో హిమాలయాలకు వెళ్లటానికి కూడా అమే కారణం. ముందు ఆమె వెళ్లి, తరువాత ల్యారీని తీసుకు వెళ్లింది.

పెళ్లి అయిన కొన్ని రోజులకే ల్యారీ 1969 జూలై లో ఇంటరన్ షిప్ కోసం అమెరికా తూర్పుప్రాంతంలోని డెట్రాయిట్ నుండి పశ్చిమ తీరంలోని శాన్ ఫ్రాన్సిస్కో వచ్చాడు. అప్పటికే ఉద్యమాల్లో చురుకుగా పాల్గొన్నందున విప్లవ డాక్టరు (Radical Doctor) అని పేరు పొందాడు. ఆసుపత్రి వాళ్లు తమ పత్రికలో 'విప్లవ వైద్యుడు మన కాలేజిలో ఇంటర్న్ షిప్ చేయటానికి వస్తున్నాడు' అనే పెద్దవార్తతో స్వాగతం పలికారు. ల్యారీ ఇంటర్న్ షిప్ సమయంలో కూడా తీరిక ఉన్నప్పుడు పౌరహక్కుల ఉద్యమాలలో పాల్గొన్నాడు. అంతా సాఫీగా సాగిపోతుంది. ఏడాది గడిచింది.

ఒకరోజు ల్యారీ రోగులను పరీక్షించే టప్పుడు చేయి పక్కకు పోవటం ప్రొఫెసరు గారు గమనించి పరీక్షలు చేయించారు. ల్యారీకి థైరాయిడ్ గ్రంథిలో నాలుగు చిన్న కణుతులు ఉన్నాయని తెలిసింది. వాటికి ఆపరేషన్ చేయాలి, అంత అత్యవసరం కాదు, కాస్త సమయం తీసుకోవచ్చు. కాని ఆపరేషన్ అయేదాకా ఇంటర్న్ షిప్ చేయటానికి వీలులేదు, విరామం ఇవ్వాలి.

**ల్యారీ బ్రిలియంట్ వార్తల్లో వ్యక్తి**

1970 ఏప్రిల్, మే సమయం. అప్పుడు లారీ బ్రిలియంట్ ను వార్తల్లో వ్యక్తిగా చేసి ఆయన జీవితాన్ని మలుపు తిప్పిన సంఘటన ఒకటి జరిగింది. ఈ సంఘటన వివరాల నేపథ్యం చూద్దాం.

*ల్యారీ బ్రిలియంట్ గురించి చెప్పేటప్పుడు మధ్యమధ్యలో వివిధ విషయాల నేపథ్యం కూడా చెప్పాలి. అది తెలిస్తే ల్యారీ జీవితం అర్థం అవుతుంది.*



శాన్ ఫ్రాన్సిస్కోకు సుమారుగా మైలుంపావు దూరంలో పసిఫిక్ మహాసముద్రం మధ్యలో ఒక ద్వీపం ఉంది. దాని పేరు ఆల్కెట్రాజ్. ఆ ద్వీపం మీద కొన్ని భవన

సముదాయాలు ఉన్నాయి. మొట్ట మొదట్లో దాన్ని లైట్ హౌస్ గా వాడేవాళ్ళు. ఆ తరువాత ఆ ద్వీపానికి సహజ భద్రత దృష్ట్యా దాన్ని మార్చారు. ఎవరైనా అక్కడికి వెళ్లాలంటే పడవలో కాని, హెలికాప్టర్ లో గాని వెళ్లాల్సిందే. భూమార్గం లేదు, అక్కడినుంచి తప్పించుకోవటం చాలా కష్టం. ఆ ద్వీపం చుట్టూ ఉండే నీళ్లు అతి శీతలంగా ఉంటాయి. పొరపాటున ఎవరైనా నీళ్లలోకి దూకితే గడ్డకట్టి పోవాల్సిందే. అంతగా సహజభద్రతతో ఉంటుంది. కాబట్టి దాన్ని కొంత కాలం మిలటరీ జైలుగా ఉపయోగించారు. దానిని 1934 నుంచి 30 సంవత్సరాల పాటు ఫెడరల్ జైలుగా కూడా ఉపయోగించారు.



ఈ ఆల్కట్రాజ్ మీద చాలా సినిమాలు కూడా వచ్చాయి. అక్కడ ఉండే వాళ్ళు తప్పించుకుపోవడం, వాళ్ళు పడే కష్టాల వంటివన్నీ కూడా తీశారు.1963 లో ఆల్కట్రాజ్ ద్వీపంలోని ఆ జైలును అమెరికా ప్రభుత్వం మూసేసింది.

1969 నవంబర్ లో కొన్ని వందల మంది 'నేటివ్ అమెరికన్స్' పడవల్లో వెళ్లి ఆల్కట్రాజ్ ను ఆక్రమించి, 'ఇది మాదే' అని ప్రభుత్వానికి సవాల్ విసిరారు.

**నేటివ్ అమెరికన్స్**

'నేటివ్ అమెరికన్స్' అంటే ఎవరు? వాళ్లని 'నేటివ్ ఇండియన్స్' అని కూడా అంటారు. కొలంబస్ అమెరికాను కనిపెట్టి, యూరోపియన్లు ఈ భూభాగాన్ని ఆక్రమించుకొనక ముందు ఇక్కడ ఉన్న వాళ్ళని 'నేటివ్ అమెరికన్స్' అంటారు.

అలాగా నాలుగైదువందలమంది ఆల్కట్రాజ్ ను ఆక్రమించుకొని దాదాపుగా సంవత్సరమున్నర పైగా అక్కడ ఉన్నారు. ఆ తరువాత అమెరికా ప్రభుత్వం వాళ్లను అక్కడినుంచి ఖాళీ చేయించింది.

అలాగా ' నేటివ్ అమెరికన్స్' ఆల్కట్రాజ్ మీద ఉన్న రోజుల్లో ఆ దీవి నాయకుని భార్య ప్రసవం అయ్యే సమయం వచ్చింది. ఆ ద్వీపంలో కరెంట్ లేదు, నీటి సరఫరా లేదు. అ పరిస్థితుల్లో, ప్రసవానికి దగ్గరవుతున్న ఆ మహిళకు సహాయం చేయడానికి డాక్టర్లు ఎవరైనా ఉన్నారా? అని ఫ్రెండ్స్ శాన్ ఫ్రాన్సిస్కో నుంచి వచ్చే క్రానికల్ వార్తా పత్రికల్లో ప్రకటనలు వేశారు. ఆ సంఘటన ప్రభుత్వంతో తలపడుతున్న సంఘటన కాబట్టి అక్కడికి వెళ్లి వాళ్లకు సహాయం చేయడానికి డాక్టర్లు ఎవరూ ముందుకు రాలేదు.

లారీ బ్రిలియంట్ 26 సంవత్సరాల యువవైద్యుడు. అప్పటికే పౌరహక్కుల ఉద్యమాల్లో ఆరితేరి ఉన్నాడు. ఆయన వెంటనే రంగంలోకి దూకాడు. పైగా అతను ఇంటర్న్ షిప్ చేయటం లేదు. మెడ దగ్గర గ్రంథులకు ఇలాంటి ఆపరేషన్ చేసుకునే దాకా అతను చదువు కొనసాగించకూడదు. కాబట్టి ఖాళీగా ఉన్నాడు.

' నేను వెళ్తాను ' అని ల్యారీ ముందుకు వచ్చేసరికి ఒక క్లబ్బు వాళ్ళు పడవలో లారీని ఆల్కట్రాజ్కు తీసుకెళ్లారు. ల్యారీ అక్కడ రెండు మూడు వారాలున్నాడు. తనకున్న పరిమిత వనరులతోనే ఆ గర్భిణీ స్త్రీకి కాన్పును విజయవంతంగా పూర్తి చేశాడు. ఉన్న

కొద్ది వనరుల తోటే ఏదైనా సాధించొచ్చునని వాళ్ల నాన్న చెప్పాడు. ఆ సందేశం గుర్తుంది. 'ఏదైనా పని చేయాలంటే నాకు అది కావాలి ఇది కావాలి, అదిలేదు, ఇది లేదు కాబట్టి ఇది చేయలేను అనకుండా నీకు ఉన్నదానితోనే ఏం చేయగలవో ఆలోచించు' అనివాళ్ల నాన్న చెప్పాడు.

అట్లా అక్కడ కరెంటు లేకపోయినా, నీళ్లు లేకపోయినా, ఇద్దరు నర్సులు మాత్రమే ఉన్నా, వాళ్ల సహాయంతో ప్రసవం పూర్తి చేశాడు ల్యారీ.



*ఒకోసారి మలుపులు ఒక మెట్టు పైకి ఎక్కిస్తాయి. మరోసారి మనిషిని దిగజారుస్తుంటాయి. అలా మనిషిని పైకి ఎక్కించే మలుపులను పదిమందీ తెలుసుకోవాలి. గుర్తుంచుకొని అలాంటి మలుపు మనకు ఎదురైనప్పుడు మనకు స్ఫూర్తి కలుగుతుంది.*

అది విజయవంతంగా పూర్తిచేసి తిరిగి వచ్చేసరికి సమాచార సాధనాలన్నీ అతని కోసం ఎదురు చూస్తున్నాయి. అన్ని టీ.వీ.ల్లో, రేడియోలలో '***ఇరవై ఆరేళ్ల డాక్టర్ చేసిన సాహసం***'అని లారీ బ్రిలియంట్ పేరు మారుమోగింది.

ఇది 1970 ఆఖరులో జరిగింది. ఆయన వెనక్కు వచ్చిన రెండు మూడు రోజుల్లో ఆయన ఎప్పుడూ ఎదురు చూడని ఒక ఫోన్ కాల్ వచ్చింది.శాన్ ఫ్రాన్సిస్కోలో ఒక రేడియో స్టేషన్ యజమాని వార్నర్ బ్రదర్స్ తో కలిపి ఒక విభిన్న సినిమా తీయడానికి ప్రణాళికలు సిద్ధం చేసుకుంటున్నాడు.

అది సినిమా అంటే సినిమా కాదు, కాదా అంటే సినిమానే. అదొక డాక్యుమెంటరీ లాంటి సినిమా. దాని పేరు ***' మెడిసిన్ బాల్ కేరవాన్.'*** ఆ రోజుల్లో ప్రసిద్ధ డ్యాన్స్ కళాకారులు అందరినీ ఐదారు వ్యానుల్లో శ్యాన్ ఫ్రాన్సిస్కో నుంచి వాషింగ్టన్ డి.సి.కి, అక్కడినుంచి లండన్ కు విమానంలో తీసుకు వెళతారు. ఈ ప్రయాణంలో వాళ్లతో పాటుగా కొన్ని హిప్పీ బృందాలు కూడా ఉంటాయి.

**పర్యటనలో వైద్యునిగా ప్రయాణానికి ఆహ్వానం**

ఆ రోజుల్లో అమెరికాలో కౌంటర్ కల్చర్ వాదం మొదలైంది. అంటే సంప్రదాయాల సంకెళ్లను ఛేదించమనే ఉద్యమాలు అనేకం బయలుదేరాయి. వాటిల్లో ఒకటి హిప్పీ సంస్కృతి. అలాంటి వాళ్లు కూడా ఈ రాక్ బ్యాండ్ తో కలిసి ప్రయాణించడం, త్రోవలో ఎక్కడపడితే అక్కడ ఆగడం, వాహనాల మీదనుంచి మ్యూజిక్ షోలుచేయటం. దీని ప్రత్యక్ష చిత్రీకరణ. అదే ***మెడిసిన్ బాల్ కేరవాన్*** సినిమా ప్రణాళిక.



దీనికి వార్నర్ బ్రదర్స్ పెట్టుబడి పెట్టింది. అలాగే ఫ్రాన్స్ నుంచి ఒక డైరెక్టర్ ను తీసుకొొచ్చి దాని దర్శకత్వ బాధ్యతలు అప్ప గించారు. ఆ బృందాలు కొన్ని ముందే వెళ్లిపోయాయి. ఎందుకంటే వీళ్ళంతా కొన్ని వారాలపాటు ప్రయాణిస్తారు. కాబట్టి వాళ్ళ వైద్యసదుపాయాలు, వాళ్ల ఆరోగ్యం చూడడానికి ఒక డాక్టరున్నాడు. రెండో డాక్టరుగా లారీని వెంటనే రమ్మని ఆహ్వానం వచ్చింది. అదీ ఆయనకు వచ్చిన ఫోన్ కాల్.

ఈ మెడిసిన్ బాల్ కార్వాన్ అనే మ్యూజిక్ ట్రూప్స్ ప్రయాణం చేస్తుంటే డాక్యుమెంటరీ చేయాలనే ఆలోచన ఎందుకు వచ్చిందంటే మనం మాట్లాడుకోవటానికి ఒక సంవత్సరం ముందు 1969 ఆగస్టు 15 నుంచి 18 వరకు న్యూజెర్సీ దగ్గరలో ఉడ్ స్టాక్ ఫెస్టివల్ అనే రాక్ మ్యూజిక్ ఫెస్టివల్ జరిగింది. మూడు రోజుల్లో దానికి దాదాపు నాలుగు లక్షల మంది హాజరయ్యారు. నాలుగు రోజుల్లోనే 32 మ్యూజిక్ షోలు జరిగాయి. దాన్ని యధాతధంగా చిత్రీకరించి, ఒక సినిమాగా విడుదల చేస్తే అది బ్రహ్మాండంగా విజయం సాధించింది. ఆ స్ఫూర్తితో వార్నర్ బ్రదర్స్ రాక్ బ్యాండ్ అందర్నీ వ్యానుల్లో తీసుకెళ్దాం అనుకున్నారు. దానికి రెండో డాక్టరుగా రమ్మని ల్యారీని అడిగారు.

ఎలాగూ ఇంటర్న్ షిప్ విరామంలో ఉంది, థైరాయిడ్ సర్జరీ ఆలస్యమైనా పర్వాలేదు అని చెప్పారు డాక్టర్లు. ఒక నెలరోజులు విహారయాత్ర లాగా ఉంటుంది కదా అని భార్యాభర్తలిద్దరూ ఒప్పుకున్నారు.

అలా ఆ కేరవాన్ బస్సుల్లో శాన్ ఫ్రాన్సిస్కో నుంచి వాషింగ్టన్ డి.సి.వరకు,అక్కడి నుంచి లండన్ వెళ్లారు, ల్యారీ ఆయన భార్య.

ఒకవైపు రాక్ బ్యాండ్స్, మరొకవైపు విజృంభించిన చిత్రవిచిత్రమైన అనుభవాలతో సినిమా షూటింగ్  పూర్తి చేశారు ల్యారీ దంపతులు. లండన్లో చిట్టచివరి కచేరి అయ్యాక ల్యారీ దంపతులు వెనక్కి శాన్ ఫ్రాన్సిస్కో వచ్చేశారు. మ్యూజిక్ బ్యాండ్ కూడా వచ్చేసింది.

కానీ ల్యారీకి మాత్రము తన జీవితంలో మరో ముఖ్య మలుపుకి కారణమైన ఒక వ్యక్తి పరిచయం అయ్యాడు. ఆయన పేరు వావి గ్రేవి. ఆయన ఆగ్ ఫామ్ అనే హిప్పీ బృందానికి నాయకుడి లాంటి వాడు. ఆయన అసలు పేరు రామ్మి. వావీ గ్రేవీ మీద పది సంవత్సరాల కిందట ఒక సినిమా వచ్చింది. దాంట్లో ల్యారీ కూడా వేషం వేసాడు.

ఇలాగా ఆ సినిమా షూటింగ్ నుంచి తిరిగి ఇంటికి వచ్చాక థైరాయిడ్ సర్జరీ జరిగింది. క్యాన్సరు ప్రమాదం ఏమీ లేదని చెప్పారు. మళ్లీ తన ఇంటర్న్ షిప్ కొనసాగించాడు. భార్య లా స్కూల్లో చేరింది. ఆ జీవితం అలాగే కొనసాగి ఉంటే మనం మాట్లాడుకుంటున్న ఇన్ని మలుపులు ఉండేవో, లేవో కాని, ఒకరోజు ఆ వావీ గ్రేవి పరిచయం అయ్యాడు. 1970 చివర్లో ఆయనే స్వయంగా ల్యారీ వాళ్ళ ఇంటికి వచ్చాడు.

ఆ విశేషాలు తెలుసుకోవాలంటే, ఒక్కసారి అమెరికా నుంచి భారతదేశం వెళ్లాలి.



బంగ్లాదేశ్ అప్పటికి ఇంకా ఈస్ట్ బెంగాల్ గానే ఉంది. ఆ ఈస్ట్ బెంగాల్ ను పెద్ద తుఫాను ముంచెత్తింది. వేలాది మంది చని పోయారు.ఇంకా చాలామందికి సహాయం అందవలసి ఉంది. పునరావాస కార్యక్రమాలు ముమ్మరంగా సాగుతున్నాయి. అందులో పాల్గొనటానికి ఈ ఆగ్ ఫామ్ అంతా వెళ్తుంది.

ఇప్పటికే వాళ్ళ బస్సుల్లో లండన్ నుంచి బయలుదేరి వెళ్తున్నారు. నేను కూడా వెళ్తున్నాను, మీరు కూడా మాతో రండి అని లారీ దంపతులను వావీ గ్రావీ ల్యారీ దంపతులను ఆహ్వానించాడు. ల్యారీ, గిరిజ దంపతులు మెడిసిన్ బాల్ కారవాన్ ట్రూపుతో వెళ్ళినప్పుడు హిప్పీలతో బాగా స్నేహం అయింది, వాళ్ళ సంస్కృతి వైపు కొంచెం కొంచెంగా ఆకర్షింప బడ్డారు.

కాకపోతే ల్యారీకి సమాజానికి సహాయం చేయడం, ఆపదల్లో ఉన్నవారిని ఆదుకోవడంలో కాలేజీలో ఉన్నప్పటి నుంచి కూడా చాలా ఇష్టం. ఆయన ముమ్మరంగా పాల్గొనే వాడు. కాబట్టి ఈ హిప్పీలతో ప్రయాణం అనే కంటే బాధితులకు సహాయం చేయడం అనటం ల్యారీకి నచ్చింది. సాహసాలు, ముందుకు దూకటం ల్యారీకి ఇష్టం. ల్యారీ, ఆయన భార్యా ఇద్దరూ కూడా వావీ గ్రావీతో, ఆ హిప్పీ బృందంతో కలిసి ప్రయాణిస్తూ, యూరప్ మీదుగా ఈస్ట్ బెంగాల్ వెళ్లాలని నిర్ణయించుకున్నారు.

ఇంకా అప్పటికి ల్యారీకి ఇంటరన్ షిప్ పూర్తి కాలేదు. భార్య అప్పుడే లా స్కూల్లో చేరింది. కాకపోతే కొన్ని నెలల ప్రయాణం కదా చదువుకోవటానికి ఉంటాయని ఆమె తన పుస్తకాలు కొన్ని మూటకట్టుకున్నది. ల్యారీ, భార్య ఇద్దరు కూడా గ్రావీతో కలసి, యూరప్ వెళ్లి, అప్పటికే ప్రయాణం మధ్యలో ఉన్న ఆగ్ ఫామ్ బృందాలను చేరి, యూరోప్ దేశాలు, ఆసియా దేశాలు దాటు కుంటూ ఈస్ట్ బెంగాల్ సరిహద్దులకు చేరుకునేసరికి కొన్ని నెలలు పట్టింది.

అలా ఎందుకు వెళ్లారు? సహాయం చేయాలంటే వెంటనే విమానంలో వెళ్లొచ్చు కదా? కాకపోతే వాళ్లు అప్పటికే ప్రయాణం చేస్తున్నారు. అలాగే ఈ త్రోవలో కూడా వాళ్ళందరికీ సహాయం చేసుకుంటూ వెళ్లాలి.

అట్లా అక్కడికి వెళ్లేసరికి 1971 ఏప్రిల్, మే ప్రాంతాలు అయింది.2,3 నెలలు పట్టింది. అప్పటికే తుఫాను వల్ల కలిగిన నష్టాల కంటే కూడా ఈస్ట్ బెంగాల్ లో రాజకీయ అనిశ్చితి నెలకొని ఉన్నది. ఎందుకంటే 'బంగ్లాదేశ్ అనే మా దేశం మాకు కావాలని' ఒక స్వతంత్ర ఉద్యమం తీవ్రస్థాయిలో జరుగుతోంది. ఇలాంటి పరిస్థితుల్లో ఆ దేశంలో సేవలందించే సంగతి అలా ఉంచి అసలు దేశంలో ప్రవేశించడమే ప్రమాదకరమని తెలిసింది.



ల్యారీ వాళ్ళు హిప్పీ బృందంతో అన్ని నెలలు కలసి ప్రయాణం చేసి, ఈస్ట్ బెంగాల్ వచ్చేసరికి ల్యారీ, ఆయన భార్య కూడా హిప్పి సంస్కృతులకు అలవాటు పడ్డారు.

వేషధారణ మారింది, వాళ్లకు అంకితమై పోయారు. వాళ్లతో మమేకమై పోయారు. ల్యారీ భుజాలు దాటిన జుట్టు పెంచు కున్నాడు. బంగ్లాదేశ్ లో అడుగు పెట్టడానికి వీలు లేదు కాబట్టి నేపాల్ లోకి ప్రవేశించారు. హిప్పీలు ఎందుకో ఆ రోజుల్లో

ఎక్కువగా ఖాట్మండు ప్రాంతాలకు ఎక్కువగా చేరుకునే వారు. ఈ బృందం కూడా అదే చేసింది.




అప్పుడు అక్కడ దేవానంద్ సినిమా 'హరే రామ హరే కృష్ణ' కు 'దమ్ మారో దమ్' అనే పాట షూటింగ్ జరుగుతోంది. ఆ షూటింగ్ కు కొంతమంది హిప్పీలు కావాలని ప్రొడక్షన్ యూనిట్ వాళ్లు వెతుకుతున్నారు. ల్యారీ బ్రిలియంట్, అలాగే మరికొంతమంది ఆగ్ ఫామ్ సభ్యులు కూడా అందులో వేషం వేయడానికి ఆ జీనత్ వెనకాల ఉంటారు. అక్కడినుంచి భారత దేశంలోని అమృతసర్ ప్రవేశించి అగ్రా, ఢిల్లీ, వంటి నగరాలన్నీ తిరిగారు. ఢిల్లీలో ఉన్నపుడు మళ్లీ ఇంకొక మలుపు వాళ్ళ జీవితంలో.



ఏమైంది అంటే, వాళ్ళు డబ్బులు మార్చుకోవడానికి అమెరికన్ ఎక్స్ ప్రెస్ ఆఫీస్ కి వెళ్లారు. అక్కడ కాషాయ దుస్తుల్లో ఉన్న ఒక అమెరికన్ పరిచయమయ్యాడు. ఆ వ్యక్తి అసలు పేరు రిచర్డ్. హార్వర్డ్ యూనివర్సిటీ ప్రొఫెసరుగా పనిచేసేవాడు. మాదక

ద్రవ్యాల  ప్రభావం మనిషి మీద ఎలా ఉంటుందో తెలుసు కోవటానికి అనధికార ప్రయోగాలతోఉద్యోగం చేజార్చుకున్నాడు.

తరువాత ఆధ్యాత్మిక జ్ఞానోదయానికై దేశదేశాలు తిరుగుతూ హిమాలయాలకు వెళ్ళాడు. అక్కడ ఆయనకొక బాబాతో పరిచయమైంది. బాబా సూచన మేరకు తన పేరును 'రాందాస్' అని మార్చుకున్నాడు. ఆ రామదాస్ అనబడే ఆచార్య రిచర్డ్ అక్కడ ల్యారీ దంపతులకు పరిచయం అయ్యాడు. అమెరికన్ ఎక్స్ ప్రెస్ ఆఫీసులో అప్పటికే  రాందాస్ రాసిన 'బి హియర్ నౌ' Be here, Now (ఇప్పుడే, ఇక్కడే ఉండండి) అనే ఒక పుస్తకం ఉన్నది. అది బాగా ప్రచారంలో ఉంది. ఇదంతా 1971 మధ్యలో జరుగుతుంది. రామదాస్ మాటల మధ్యలో చెప్పాడు నాకు  హిమాలయాల్లో ఒక బాబా పరిచయం అయ్యాడు అని ఆయన గురించి చాలా గొప్పగా చెప్పాడు. ల్యారీ దానిని అంతగా పట్టించుకోలేదు. ల్యారీ భార్య, ఆ హిప్పీ బృందంలోని ఇంకొక అమ్మాయి రాందాస్ చెప్పిన బాబా విశేషాలు శ్రద్ధగా విన్నారు. వినడమే కాకుండా మీరు మమ్మల్ని అక్కడకు తీసుకెళ్తారా? అని రామదాసును అడిగారు.

శాన్ ఫ్రాన్సిస్కో వదిలేసి కొన్ని నెలలవుతోంది.ల్యారీ తొందరగా వెళ్లి మెడిసిన్ ఇంటరిన్ షిప్ పూర్తి చేయాలనుకున్నాడు. బాబా ఎవరో నువ్వు చూసి తొందరగా వచ్చేయ్ అని భార్యకు చెప్పి ల్యారీ శాన్ ఫ్రాన్సిస్ కో వచ్చేశాడు. ఏడెనిమిది నెలలు అలా గడిచాయి.

గిరిజ, మరో మహిళతో కలిసి రామ్ దాస్ మార్గదర్శకత్వంలో హిమాలయాలకు వెళ్ళింది.

ల్యారీ ఇంటరన్ షిప్ కొనసాగించాడు. అప్పట్లో 1971లో ఈ టెలిఫోన్ల వంటి సౌకర్యాలు ఎక్కువ లేవు. హిమాలయాల్లో ఉన్న భార్య దగ్గర నుంచి ఎప్పుడో ఒకసారి ఒక ఫోన్ వచ్చేది, అదీ సరిగా వినిపించేది కాదు. అప్పుడప్పుడు టెలిగ్రాములు వచ్చేవి.

ఆవిడ ఏమి రాస్తుంది? ***' బాగానే ఉన్నాను, ఈ ఆశ్రమ జీవితం చాలా బాగుంది, జీవితంలో ఏదో అనిర్వచనీయ ప్రశాంతత దొరుకుతుంది. ఇక్కడ బాబాను మహరాజ్ జీ అనీ అంటారు'. ఈ మహారాజ్ సన్నిధిలో నాకు ఎంతో శాంతి లభిస్తుంది.***

ఇలా ఏదో రాస్తుంటుంది. మళ్లీ త్వరలో వద్దామనుకున్న గిరిజ ఐదారు నెలల తర్వాత కాని అమెరికాకి రాలేదు. ఈలోగా ల్యారీకి మెడిసిన్ పూర్తయింది. ఆయన భార్య తిరిగి వచ్చింది, ఆమె రూపం చూసి ఆశ్చర్య పోయాడు ల్యారీ. ఆమె పూర్తిగా మారి పోయింది. పేరు కూడా గిరిజా బ్రిలియంట్ అని మార్చుకుంది, వేషధారణలో మార్పులు చేసుకున్నది. ఆమె ఇప్పటికీ గిరిజా బ్రిలియంట్ పేరుతోనే ఉంది. వదులుగా ఉన్న కాషాయ దుస్తులు, ఒకోసారి చీరలు కూడా కట్టుకుంటోంది. ల్యారీ ఆశ్చర్య పడలేదు కాని వివరాలు తెలుసుకున్నాడు. రామదాస్ చెప్తే ఒకసారి విన్నాడు. అంతే. భార్య గిరిజ మహారాజ్ జీ గురించి పదే పదే చెప్పి, నువ్వు కూడా వచ్చేయ్, మనం ఇద్దరం మహారాజు దగ్గరకు వెళ్లి కొన్ని నెలలు ఉండి వద్దాము అని పదేపదే అనడం మొదలు పెట్టింది.

ల్యారీకి ముందుగా అర్థం కాలేదు. అప్పటికి హిప్పీ స్వేచ్ఛా వాతావరణం తెలుసు. ఆ జీవితం చూసి ఉన్నాడు. భార్య పదే పదే చెప్పిన మీదట ' సరే, ఈ అమెరికా హడావిడి జీవితం ఎలా చూశాము కదా, కొన్నాళ్లు ప్రయత్నిస్తే తప్పు ఏమి ఉంది? పైగా ఈయన వెళ్లనన్నా ఆవిడ వెళ్లి కొన్ని రోజులు ఉండటానికి సిద్ధపడింది. ఇలాంటప్పుడు విభేదించటం ఎందుకు?' అనుకొని భార్యతో హిమాలయాలకు ప్రయాణం అయ్యాడు ల్యారీ.

1972 వచ్చేసింది. వాళ్ళ అమ్మగారు, అత్తగారు ఇద్దరూ బాధ పడ్డారు. నాన్నగారు చనిపోయేటప్పుడు చదువుకోమని చెప్పారు. ఎక్కడకు మీరిద్దరూ వెళ్ళిపోవడం? హిమాలయాలు ఎక్కడ? కోడలు ఈ వేషం ఏమిటి? అని ల్యారీ అమ్మ బాధపడింది,

కాకపోతే అప్పటికే వీళ్లు ప్రయాణమై సిద్ధంగా ఉన్నారు. కాబట్టి పెద్దలకు మొక్కుబడిగా చెప్పి హిమాలయాల బాట పట్టారు. జేబులో 500 డాలర్లు ఉన్నాయి.
అమెరికా బ్యాంక్ లో మరో 500 డాలర్లు ఉన్నాయి. అంత మాత్రమే వారు పొదుపు చేసుకోగలిగారు. భార్యభర్తలు ఇద్దరూ చెరో వీపుసంచి మాత్రమే వేసుకొని, జాగ్రత్తగా బయలు దేరారు.

భారతదేశం వచ్చేసారు. ఏం చేయాలి? ఏమి సాధించాలి? కచ్చితంగా ఇది కావాలి అన్న ఆలోచనే లేదు. హిమాలయాలు చూడాలని ల్యారీ కోరిక. బాబాను చూద్దాం అనేది ల్యారీ భార్య. ఆమె ఇంతకు మునుపే ఒకసారి బాబాను చూసింది. ఆయన పేరు నీబ్ కరోలి బాబా. అసలు పేరు లక్ష్మీ నారాయణశర్మ.

1900 సంవత్సరంలో ఉత్తరప్రదేశ్లో అక్బర్‌పూర్ లో జన్మించాడు. బాగా ఉన్న కుటుంబమే. ఎందుకో గాని పది పదకొండు ఏళ్లకే ఇంట్లో నుంచి వెళ్లిపోయి ఎక్కడెక్కడో సాధువులతో తిరిగేవాడు. వాళ్ల నాన్న వెదికి తీసుకువచ్చి పెళ్లి చేశాడు. ఇద్దరు కొడుకులు, ఒక కూతురు పుట్టారు. శ్రీ లక్ష్మీనారాయణ శర్మ తన 58 సంవత్సరాల వయసులో ఇల్లు వదిలి వెళ్ళిపోయాడు.

ఈసారి వెళ్లడం వెళ్లటం కాంచీ అనే ప్రదేశానికి వెళ్లాడు. అది నైనిటాలుకు 15 కిలోమీటర్ల దూరంలో ఉంటుంది. అక్కడ హనుమాన్ దేవాలయం నిర్మించుకుని ఆశ్రమ జీవితం గడపటం మొదలుపెట్టాడు.అక్కడినుంచి లక్ష్మీనారాయణశర్మ ***నీబ్ కరోలీ బాబా*** అయ్యాడు. ఆ పేరు రావడానికి కూడాఒక కారణం చెపుతారు, ఇది ఎంతవరకు నిజమో తెలియదు. కానీ ఆయన ఇల్లు వదిలి వచ్చేటప్పుడు నీబ్ కరోలి అనే ఊర్లో రైలులో వెళుతుంటే ఆయనకి టిక్కెట్ లేకపోతే కిందికి దించేశారట.




మళ్లీ ఆయనను రైలు ఎక్కనిచ్చే దాకా రైలు బయలుదేరలేదని బాబా భక్తులు చెబుతుంటారు. ఏమైనా గాని నీబ్ కరోరి అనే ఊళ్లో ఇది జరిగింది కాబట్టి అప్పటి నుంచి ఆయన్ని నీబ్ కరోలి బాబా అనే వాళ్ళు. బాబాగురించి ఇలాంటి కథలు చాలా ప్రచారంలో వున్నాయి. హిమాలయాల దగ్గర ఉన్న ఆయన ఆశ్రమానికి 1960- 70 దశాబ్దంలో పాశ్చాత్యులు ఎక్కువగా వచ్చే వాళ్ళు.

కరోలి బాబా వాళ్లందరికీ కృష్ణదాస్, రామదాస్, భగవాన్ దాస్, వంటి హిందువుల పేర్లు పెట్టేవాడు. విదేశీయులు బాబా దగ్గరికి రావడానికి ప్రత్యేక కారణం ఏమీ కనిపించదు, ఆ కాలంలో అలా జరిగింది. అంతే. బాబా పెద్దగా ఉపన్యాసాలు ఇవ్వడం, మహిమలు చూపడం వంటివి ఏవీ చేసేవాడు కాదు, ఎప్పుడూ ఒక దుప్పటి కప్పుకొని ఉండేవాడు. అందుకని ఆయన్ని బ్లాంకెట్ బాబా అని కూడా కొందరు అనేవాళ్ళు. ఆయన ఆశ్రమం పక్కనే ఉన్న హనుమాన్ దేవాలయంలో పూజలు చేసేవాడు. అంతే. ఆయన నేను దేవుడిని, నన్ను నమ్మండి అని ఎప్పుడూ చెప్పేవాడు కాదు. చాలా సాదాసీదాగా ఉండేవాడు. కాకపోతే వచ్చిన వాళ్లందరికీ కూడా మీరు ఇక్కడ కూర్చొని భజనలు చేయడం కాదు, మీరు ప్రజాసేవ చేస్తూ ఉండండి అని చెప్పేవాడు.

మానవసేవే మాధవసేవ అని అందరూ చెప్పేసూక్తులను మరింత గట్టిగా చెబుతుండే వాడు.



ఆయన మహత్యాలు ఏమీ చేసేవాడు కాదు కానీ ఆయనను నమ్మినవారికి మాత్రం ఆయనలో ఏవో మహత్తులు కనిపించేవి. ఏదో మాకు అక్కడ కనిపించాడు. మేము అక్కడ ఏదో పుస్తకం చదువుతూ ఉంటే, ఇక్కడ బాబా ఆ పుస్తకమే చదువుతున్నాడు. ఇలాంటి అసాధ్యాలు జరిగినట్లు చెపుతుండే వారు.

ఆ తరువాత బాబా బృందావనం దగ్గర కూడా ఒక ఆశ్రమం కట్టుకుని కంచిలో, నైనిటాల్ దగ్గర ఉన్న ఆశ్రమానికి, బృందావన ఆశ్రమానికి కొన్నాళ్లు అక్కడ, ఇక్కడ ఉండేవాడు, నీబ్ కరోలి బాబాను '*బాబాజీ*' '*మహారాజ్ జీ*' అని కూడా అంటారు.
మనం మాట్లాడే సమయానికి ఆయన నైనిటాల్ ఆశ్రమంలో ఉన్నాడు. అంటే, ఇప్పుడు ఈ 2020లో చూసుకుంటే, భారత దేశంలోని పలు ప్రాంతాల్లో, అమెరికాలోని న్యూమెక్సికో రాష్ట్రంలో కూడా బాబా ఆశ్రమశాఖలు ఉన్నాయి.

బాబా దగ్గరకు వచ్చే భక్తులు, సందర్శకులు, నైనిటాల్ దగ్గర హోటల్ లో ఉండి అక్కడి నుంచి బాబా ఆశ్రమానికి వెళ్తుంటారు. కొందరు ఆశ్రమం చుట్టుపక్కలే ఉంటారు.

ల్యారీకి ఇండియా రావటం ఇది రెండోసారి. అంతకు కొద్ది నెలల కిందట ఆగ్ ఫామ్ హిప్పీలతో కలిసి భారతదేశమంతా తిరిగాడు. ఈసారి నైనిటాల్ హోటల్లో ఉండి, భార్యతో కలసి కరోలి బాబా ఆశ్రమానికి వెళ్ళాడు. మొదట్లో ఆయనకు పెద్దగా ఏ భావమూ కలగలేదు. స్వామీజీ లారీ భార్యతో మాట్లాడేవాడు. లారీతో అంతగా మాట్లాడేవాడు కాదు. ఒకటి,రెండు వారాలు అయాక ల్యారీ భార్యతో చెప్పాడు 'నువ్వు అనుకుంటున్న అతీంద్రియ శక్తులు, అనుభూతులు ఎలాంటివీ నాకు కనిపించటం లేదు. వెనక్కి వెళ్ళిపోదాము' అని. అయితే భార్య 'నేను మాత్రం ఇక్కడే ఉంటాను కొన్ని రోజులు, కావాలంటే నువ్వు వెళ్లిపో' అన్నది. అయితే గతంలో ఒకసారి చాలా రోజులు దంపతులు విడిగా ఉన్నారు. ఈసారి కూడా ఆమెను వదిలి వెళ్ళడానికి, ఘర్షణ పడడానికి సిద్ధంగా లేదు ల్యారీ.

అలాంటి పరిస్థితుల్లో ఒకసారి దగ్గరికి వెళ్ళేసరికి బాబా ల్యారీ చేతుల్ని తనచేతుల్లోకి తీసుకొని, క్షేమసమాచారాలు అడిగాడు. ఇంతకు ముందు అతను ఏం చేశాడో, ఆయన ఊహించనివన్నీ చెప్పాడని, బాబా స్పర్శతో తనలో ఏదో తెలీని అద్భుతభావన కలిగిందని ల్యారీ రాసుకున్నారు.



ఇలాంటివన్నీ వ్యక్తిగత నమ్మకాలు. ఇలాంటివి తర్కం ముందు నిలువలేవు. ఆయన నమ్మాడు అంతే. అప్పటినుంచి, 26 యేళ్ల అమెరికా యువ డాక్టర్ కరోలి బాబాకు పరమశిష్యుడయ్యాడు. బాబా చేతుల్లోకి తన చేతులు తీసుకోగానే ల్యారీ అద్భుత అనుభూతి పొందాడు. అంతే. ఇక రోజూ ఆశ్రమంలో జరిగే పూజలు, భజనలలో పాల్గొనడం, బాబా చెప్పే సందేశాలు వినడంతో ల్యారీ జీవనవిధానం మారిపోయింది. అమెరికాలో తాను ఒక డాక్టర్ అన్న విషయాన్ని కూడా మర్చిపోయే అంతగా ఆయన బాబా ఆరాధన ఆరంభించాడు. ఆశ్రమంలో ల్యారీ నేలమీద చాపపై పండుకున్నాడు. ధ్యానం చేశాడు. జపం చేశాడు. ల్యారీ ఆలోచనా విధానం మారింది. ఐహికం నుంచి పారమార్థికం వైపుకు మరలాయి. బాబా గమనించాడు.

డాక్టర్ ల్యారీకి సుబ్రహ్మణ్యం అని నామకరణం చేశాడు. బాబా మాత్రం ల్యారీని *'డాక్టర్ అమెరికా'* అని పిలిచే వారు. ల్యారీ అర్థాంగికి గిరిజ అని పేరు పెట్టారు. ల్యారీ హిందీ నేర్చుకోవడం, భగవద్గీతాసారం తెలుసుకోవడం, హనుమాన్ చాలీసా పఠనం, ఇలాంటివి మొదలుపెట్టాడు. రెండు మూడు నెలలు గడిచాయి. నీబ్ కరోలీబాబాని మహారాజ్ జీ అని కూడా అంటారు.

బాబా ఒకసారి నైనిటాల్ ఆశ్రమం నుంచి, బృందావన ఆశ్రమం వెళ్ళాడు. వాళ్ళతో పాటే భక్తులందరూ బయలు దేరారు. ల్యారీ, భార్య గిరిజ కూడా వాళ్ళను అనుసరించారు.

అక్కడ ఉండగా ఒకరోజు మహారాజ్ జీ ల్యారీని పిలిచి అడిగాడు. మీ దగ్గర ఎన్ని డబ్బులు ఉన్నాయి?

500 డాలర్లు.

ఇక్కడ సరే, అమెరికాలో నీ దగ్గర ఎన్ని డబ్బులున్నాయి? బ్యాంకులో మరో 500 ఉన్నాయి.

అయితే డాక్టర్ అమెరికా, 'యూనో' అన్నాడు బాబా. ల్యారీకి అర్థం కాలేదు, 'యూనో' అని నాలుగైదు సార్లు అడిగే సరికి బహుశా యు నో అంటే యు.ఎన్.ఓ. అంటున్నాడేమో అనుకున్నాడు ల్యారీ. అది యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్ అయి ఉంటుందని ల్యారీకి తెలుసు, కానీ బాగా అర్థం కాలేదు. బాబా ఎందుకు అడుగుతున్నాడో అంతుబట్ట లేదు.

నా దగ్గర కూర్చొని పూజలుచేయడం కాదు, నువ్వు చదివిన వైద్యవృత్తిని ప్రజలకు వినియోగించడమే నీ బాధ్యత. తక్షణమే ప్రారంభించు, నీ బాధ్యతలు నెరవేర్చు. ఢిల్లీలో యూ.యన్.ఓ. బృందం ఉంది. వాళ్ళు భారతదేశంలో మశూచి నిర్మూలన కోసం ప్రణాళికలు సిద్ధం చేసుకుంటున్నారు. నువ్వు వెళ్లి ఆ బృందంలో చేరు. డాక్టరుగా నువ్వు మశూచి నిర్మూలనలో ముఖ్యపాత్ర పోషించాలి, నేను చెబుతున్నాను. నమ్ము, భారత దేశంలో మశూచిని నిర్మూలించవచ్చు అని పదేపదే చెప్పాడు మహారాజ్ జీ డాక్టర్ లారీ బ్రిలియంట్ కు.

ల్యారీ మసూచి(Smallpox) గురించి విన్నాడు గాని పెద్దగా వివరాలు తెలియవు. పైగా యునైటెడ్ నేషన్స్ లో కూడా పని చేయలేదు. సరే ఈ బాబా ఏదో చెప్పాడు, మర్చిపోతాడులే అనుకున్నాడు, కానీ ఆ మర్నాడు, ఆ మర్నాడు కూడా, ఏంటి నువ్వు ఇంకా వెళ్లలేదా? వెంటనే ఢిల్లీ వెళ్ళు అని ఆ మహారాజ్ జీ ఒత్తిడి చేయడంతో భార్య గిరిజతో కలిసి బృందావనం నుంచి ఢిల్లీ వెళ్ళాడు ల్యారీ.

అక్కడ వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ కార్యాలయంలో యూ.యన్. ఓ. శాఖ కూడా ఉంది. ఆ పరిస్థితుల్లో అక్కడికి వెళ్ళిన ల్యారీని చూసిన వాళ్ళు ఎవరూ కూడా అయన డాక్టర్ అనుకోరు. కాషాయ దుస్తులు, భుజాలమీదుగా పెరిగిపోయిన పొడవాటి జుట్టు, గడ్డం, భార్య గిరిజ దుస్తులు, తెల్లచీర, ప్రపంచ ఆరోగ్య సంస్థ వాళ్ళకి అర్థం కాలేదు. నేను డాక్టర్ ను. హిమాలయాల్లో మహారాజ్ జీ దగ్గర ఉంటున్నాను, ఆయన మీ

దగ్గరికి వెళ్లి ఉద్యోగంలో చేరమని పంపించారు అని చెప్పాడు. అది విని వాళ్ళు పెద్దగా నవ్వారు. ఏమిటి నువ్వు అనేది! హిమాలయాల నుండి మహారాజ్ జీ చెప్పాడా? ఏదో కట్టుకథ లాగా ఉంది.

సరే ఇంత దూరం కష్టపడి వచ్చారు కదా మీరు మరోసారి రండి, పెద్ద అధికారులు ఉంటారు, మాట్లాడవచ్చు అని పంపారు.కరోలి బాబా మళ్లీ వెళ్ళు, మళ్లీ వెళ్ళు అంటున్నాడు. మరుసటి వారం వెళ్లేసరికి డాక్టర్ కత్రి వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ తరపున కోఆర్డినేటర్ గా ఉన్నారు. ఆయన చెప్పారు, ఏమండీ, వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ లో బాగా అనుభవం ఉన్న డాక్టర్లని, యూనివర్శిటీలలో పబ్లిక్ హెల్త్ కోర్సులు చేసిన వాళ్ళని, అలాంటి నిష్ణాతులను మాత్రమే తీసుకుంటాం. నువ్వేమో చదువు కున్నాను, డాక్టరును అంటున్నావు.

ఇటు చూస్తే పర్యాటక వీసా మీద భారతదేశంలో ఉన్నావు, నీ లాగా హిమాలయాల్లో బాబాల దగ్గర ఉండే నిన్ను మేము అసలు తీసుకోలేం. ఇక నువ్వు వెళ్లి రావచ్చు' అని నిబ్బరంగా చెప్పాడు.

అక్కడినుంచి ఢిల్లీకి బాబాకు మధ్యలో బంతులాట మొదలు అయింది. అక్కడకు వెళ్లగానే మహారాజ్ అడిగేవాడు నువ్వు ఇంకా ఉద్యోగంలో చేరలేదా? వెళ్ళు, మళ్లీ వెళ్ళు. ఢిల్లీ వెళ్లాలంటే దాదాపు 15, 16 గంటలు పడుతుంది. రైళ్లు, బస్సులు, ఆటోలు, రిక్షాలు ఇలాగా. అలా వెళ్లిన దాదాపు ప్రతిసారీ, ఒకే ఫలితం. ల్యారీకి క్రమంగా అర్థమైంది. అక్కడ ఢిల్లీ కార్యాలయంలో అందరూ కోట్లు వేసుకున్నారు. మామూలు దుస్తులు వేసుకోవడం తక్కువ. ఇక్కడ మహరాజ్ జీ ఇస్తున్న భరోసా మీద నమ్మకం ఉంది. ఉన్నట్టుండి దానిని తన మీద నమ్మకంగా మార్చుకుని దానిని ఆత్మవిశ్వాసంగా తర్జుమా చేసుకుని, ఎన్ని ఇబ్బందులు ఎదురైనా, ఎన్ని సార్లయినా భరించి, పట్టు వదలకుండా కొనసాగించాడు.ఈసారి నైనిటాల్ నుంచి ఢిల్లీ ఆఫీస్ కి

మశూచి విభాగపు ప్రధాన సలహాదారు జెనీవా నుంచి వచ్చింది. ఆమెతో డాక్టర్ ల్యారీకి ఇంటర్వ్యూ దొరికింది. ఆ ఇంటర్ వ్యూ ఫలితం తెలుసుకోవటానికి ముందు మరో నేపథ్యం.



ఆ రోజుల్లో 1972- 73ల్లో భయంకర అంటువ్యాధి మశూచి. ఆ రోజుల్లోనే కాదు, అంతకు ముందు శతాబ్దాలలో గూడా చరిత్రలో ప్రపంచాన్ని గడగడ లాడించేలాగా సంభవించిన తుఫాన్లు, భూకంపాలు, రాజులు, దేశాల మధ్య యుద్ధాలు, 20వ శతాబ్దంలో జరిగిన ప్రపంచ యుద్ధాలు, వీటి అన్నింటిలో ఎంతమంది చనిపోయారో ఒక్క మశూచివ్యాధి వల్లనే అంతకు మించిన మరణాలు సంభవించాయని అంచనా. ఒక్క 20వ శతాబ్దం లోనే, 1970 సమయానికి ప్రపంచవ్యాప్తంగా కొన్ని కోట్లాది మందిని బలితీసుకుంది ఈ మశూచి వ్యాధి. ఈ వ్యాధిని కలిగించేది వైరస్. ఈ వైరస్లు రెండు రకాలుగా ఉంటాయి 1.వేరియోలా మేజర్ 2. వేరియోలా మైనర్. ఈ మేజర్ వైరస్ వల్ల కలిగే మశూచి అత్యంత ప్రమాదకారి. అదే భారతదేశంలో ఉండేది.

ఆ రోజుల్లో వ్యాధి సోకిన వాళ్ళల్లో 60 నుంచి 70 శాతం మంది తప్పనిసరిగా మరణించే వాళ్లు. ముఖ్యంగా పిల్లల మరణాల శాతం ఇంకా ఎక్కువగా ఉండేది. ఒకవేళ మరణం నుంచి బయట పడినా, వాళ్లకు వైకల్యాలు వంటినిండా

మచ్చలు. అంగవైకల్యం ముఖ్యంగా చూపు పోవటం సంభవించేది..ఈ మశూచి అంటువ్యాధిని అరికట్టటానికి 1798లోనే ఎడ్వర్డ్ జెన్నర్ అనే బ్రిటిష్ శాస్త్రవేత్త ఒక టీకామందు కనిపెట్టాడు.



అప్పటి నుంచి ఈ టీకాలు వేస్తున్నప్పటికీ వివిధ కారణాల వల్ల మశూచి వ్యాధిని నిర్మూలించడం అనేది ఆరోగ్య శాస్త్రవేత్తలను వెంటాడుతున్న, వేధిస్తున్న సవాల్ గా మిగిలింది. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత ప్రపంచ ఆరోగ్య సంస్థ వాళ్లు ప్రపంచవ్యాప్తంగా మశూచి నిర్మూలన అనే బృహత్తర ప్రణాళికను 1972-73 లో చేపట్టారు. ఎక్కువగా అభివృద్ధి చెందిన దేశాల్లో ప్రపంచ ఆరోగ్య సంస్థ సాంకేతిక సహాయంతో అప్పటికి 34 దేశాలు మశూచిని పూర్తిగా నిర్మూలించ గలిగాయి.

అయితే అంతగా అభివృద్ధి చెందని దేశాల్లో మాత్రం మశూచి ప్రభావం చాలా ఎక్కువగానే మిగిలి ఉంది. ఈ దేశాలలో కూడా ముఖ్యంగా భారతదేశం, నేపాల్, పాకిస్తాన్, బంగ్లాదేశ్ ప్రాంతాల్లో మశూచి నిర్మూలన కార్యక్రమాలు అమలు చేయాలని వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ వారు నిర్ణయించుకున్నారు. 1970 నుంచి ఢిల్లీలో, యూ.యన్.ఓ. కార్యాలయం నుంచి మశూచి నిర్మూలన కార్యక్రమాలను ప్రారంభించడానికి భారత ప్రభుత్వ అనుమతి కోసం ప్రయత్నిస్తున్నారు. అప్పట్లో ప్రధాన మంత్రిగా ఉన్న ఇందిరాగాంధీ గారు వెంటనే అనుమతి ఇవ్వలేదు, 'మా

దేశంలో మశూచికంటే ఇంకా చాలా పెద్ద ఆరోగ్య సమస్యలు ఉన్నాయి. మలేరియా, శిశుమరణాలు, ఆకలి చావులు. వీటి మీద మా దృష్టిని కేంద్రీకరిస్తున్నాం' అని ప్రతిపాదన తిరస్కరించింది. ప్రపంచఆరోగ్య సంస్థ ఉన్నత అధికారులు మశూచివ్యాధి తీవ్రత గురించి ఇతర దేశాల్లో ఎలా విజయవంతంగా నిర్మూలించిన విధానాలు చెప్పి ప్రభుత్వాన్ని ఒప్పించాలని ప్రయత్నిస్తున్నారు.

ఇదిగో సరిగ్గా ఈ ప్రయత్నాలు జరుగుతున్న రోజుల్లో, మన ల్యారీ కాస్త వేషం మార్చుకొని వచ్చాడు. ఆఫీసు చుట్టూ ప్రదక్షిణ చేస్తున్నాడు. అప్పుడు ఆయనకు ముఖ్య అధికారిణి నికోలా తో ఇంటర్ వ్యూ దొరికింది.

ఆమె 'మీ పట్టుదల బాగా నచ్చిందండీ, మశూచినిర్మూలన కార్యక్రమాలకు ప్రభుత్వం నుంచి అనుమతి వచ్చింది. National Smallpox Eradication Programme NSEP అమలు చేస్తాము. అయితే నిన్ను డాక్టర్ గా మాత్రం తీసుకోలేము, ఎందుకంటే నీకు ఇలాంటి అంటువ్యాధుల నిర్మూలన కార్యక్రమాల్లో అనుభవం లేదు. పైగా ఏ ఇతర దేశాల డాక్టర్లనైనా ఉపయోగించుకోండి. కానీ అమెరికా నుంచి వచ్చిన డాక్టర్లను తీసుకోవద్దు అని భారత ప్రభుత్వం అంటుంది. ఎందుకంటే అంతకు ముందే జరిగిన భారత్ పాకిస్థాన్ యుద్ధంలో అమెరికా పాకిస్థాన్ ను సమర్ధించడం కూడా ఒక కారణం అయ్యుండొచ్చు. ఇన్ని కారణాల వల్ల నిన్ను డాక్టర్ గా తీసుకోలేము. కాకపోతే ఒక అడ్మినిస్ట్రేటివ్ అసిస్టెంటుగా, అంటే గుమాస్తాగా తీసుకుంటాము. ఉత్తర ప్రత్యుత్తరాలు టైపుచేయటం వంటి పనులు చేయాలి. అది కూడా నువ్వు ఆఫీస్ చుట్టూ తిరుగుతున్నావు కాబట్టి ఇస్తున్నాము. రాత పని ఎక్కువగా ఉంటుంది. ఇలాంటి పనులు చేయాలి, నీ ఇష్టం?' అన్నది.

ఒక్కసారి ఊహించుకొండి, మంచి యూనివర్శిటీ డెట్రాయిట్ లో మెడిసన్ చదువుకోవటం, శాన్ ఫ్రాన్సిస్కోలో ఇంటరిన్ షిప్ పూర్తి చేయటం, మళ్లీ మలుపు

హిప్పీలతో సహవాసం, ఇప్పుడు ప్రపంచఆరోగ్యసంస్థలో కేవలం గుమాస్తాగా ఉద్యోగం చేయటం.

అయినా, మహారాజ్ జీ చెప్పాడు కనుక చేయాల్సిందే అనుకుని, 'సరే, అలాగే' అని తల ఊపాడు.

ఇంతలోనే కార్యాలయ ఉద్యోగులు 'నువ్వు అమెరికా వాడివి, ఇలా అమెరికా బయట మా సంస్థతో కలిసి పని చేయాలంటే మీ దేశం నుంచి. 'మాకు ఏమీ అభ్యంతరం లేదు' అని క్లియరెన్స్ ఇవ్వాలి. దానికోసం పంపించాము అన్నారు. ల్యారీకి గుండెలో రాయి పడినట్లు అయింది.

అమెరికాలో యఫ్.బి.ఐ. విచారణ అంటే ఆయనకు గతం గుర్తు వచ్చింది. తాను యూనివర్సిటీ లో ఉండగా మార్టిన్ లూథర్ కింగ్ తో కలిసి అరెస్ట్ కావడం, ఆ తర్వాత పౌరహక్కుల ఉద్యమాల్లో పాల్గొనడం, ఇవన్నీ చేశాడు కదా! అవి బయటికి వస్తే క్లియరెన్స్ రావటం చాలా కష్టసాధ్యం అనుకున్నాడు.

మహారాజ్ తో విషయం చెప్పాడు. మహారాజ్ 'ఏం భయపడకు, నీకు ఆ ఉద్యోగం తప్పక వస్తుంది అని చెప్పాడు. జెనీవాలో పై అధికారులకు ఈ విషయం అంతా తెలిసింది. ఈ డాక్టర్ చాలా చదువుకున్నాడు. సాధారణ గుమాస్తాగా పని చేయడానికి కూడా వచ్చాడు. చాలా పట్టుదల ఉన్న వాడిలా ఉన్నాడు అని పై అధికారులకు తెలియజేస్తే, వాళ్ళు ఇంత చిన్న ఉద్యోగానికి యఫ్.డి.ఐ.తో పనిలేదని ఆశిస్తున్నాము. ఉద్యోగంలోకి తీసుకొండి అన్నారు.

ఇన్ని మలుపుల తర్వాత 1953 జూన్ లో, ఢిల్లీలో ప్రపంచ ఆరోగ్యసంస్థలో, మశూచి నిర్మూలన కార్యక్రమంలో, గుమాస్తాగా ఉద్యోగాన్ని ప్రారంభించాడు ల్యారీ. దాదాపు 29 సం.రాల వయసులో, ఇన్ని సాహసాలు, ఇన్ని మలుపులు ఆయన

జీవితంలో కలగటం చాలా అద్భుతంగా ఉంటుంది. అందుకే ల్యారీని అందరూ అద్భుతవ్యక్తి అంటారు. అలాంటి ల్యారీ ఢిల్లీ నుంచి నైనిటాల్ వెళుతున్నాడు.

ఆ రోజుల్లో నైనిటాల్ లో చల్లని, ప్రశాంత, నిర్మల వాతావరణం నుంచి ఢిల్లీకి, విపరీతమైన వేడిగా ఉండే మహానగరానికి, 29 సంవత్సరాల డాక్టర్, హిమాలయాల్లో గురువు ఆదేశాన్ని శిరసావహించి, ఢిల్లీలో ఉద్యోగం ప్రారంభించటం మరొక మలుపు ల్యారీ జీవితంలో.

ఢిల్లీలో మశూచి నిర్మూలన కార్యాలయం, యూ.యన్.ఓ. గురించి ఎలా తెలిసింది బాబాకు? ఇవన్నీ హిమాలయాల్లో దేవాలయంలో కూర్చున్న మహారాజుకి ఎలా తెలిసాయి? ఐక్యరాజ్యసమితి అంటే ఏమిటి? ఆయనకు అసలు వీటిమీద అవగాహన ఎలా ఉంది? ఎలా తెలిసింది కార్యక్రమం గురించి? ఇలాంటి ఆలోచనలేవీ ల్యారీకి రానేలేదు. బాబా చెప్పాడు కాబట్టి ఆచరించటమే.

చేసే పని ఏదైనా సరే అంకితభావంతో చేయడం, దాని మీద నమ్మకం ఉంచడం. విజయం సాధించాలి అని దీక్షతో ఉండి, బంధాలకు అతీతంగా ఉండటం, కర్తవ్యమే దైవం అనుకోవటం, ఇలాంటివన్నీ బోధించిన స్ఫూర్తి ల్యారీని నడిపించింది.

వారం రోజుల్లో ఢిల్లీలో గుమాస్తా జీవితం ప్రారంభించాడు. కరోలిబాబా ఆశ్రమానికి వెళ్లడం, మళ్లీ అక్కడ వారాంతపు శలవుల్లో భజనలు, పూజలు, హారతులు. ఇలా ఆయన ఉద్యోగ జీవితం ప్రారంభమైంది 1973 మధ్యలో.

ఇక్కడ నుంచి మరెన్నో మలుపులతో భారతదేశంలో నాలుగేళ్లు, ఇల్లిల్లూ, ఊరూరూ తిరిగి, కొండల్లో, గుట్టల్లో, అడవుల్లో, మశూచి నిర్మూలనలో మడమ తిప్పకుండా శ్రమిస్తూ పోషించిన పాత్ర తెలుసుకుంటుంటే అశ్చర్యము వేస్తుంది. ఒక మనిషికి తనదేశం కాని దేశంలో, అంత కష్టపడి పనిచేయాల్సిన అవసరం ఏముంది! అంటే

నమ్మకం, ప్రజలకు సేవ చేయాలనే దృఢ విశ్వాసం, ఒక మనిషి ఆయనకు ఇచ్చిన నమ్మకం.

ఈ వివరాలు చూద్దాం.




**ప్రపంచ ఆరోగ్య సంస్థ కార్యక్రమాలు ప్రారంభం**

వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ కార్యక్రమాన్ని అమలు చేయటం ప్రారంభించిన 1973 జూన్, జూలై నెలలకు, భారతదేశంలో మశూచి దక్షిణాది రాష్ట్రాల కంటే ఉత్తరాది రాష్ట్రాలైన మధ్యప్రదేశ్, బీహార్, పశ్చిమ బెంగాల్ లో ఎక్కువగా ఉండేది. అందుకని నిర్మూలనా కార్యక్రమం అక్కడ మొదలైంది. మశూచి నిర్మూలన అంటే కేవలం టీకాలు వేయటమే అయితే ఇంత సంక్లిష్టత ఉండేది కాదు. టీకాలతో చేపట్టిన కార్యక్రమంతో పాటుగా మరింత లోతుగా అధ్యయనం చేసి ఒక పద్ధతి ప్రకారం అమలు చేయాల్సిన ప్రణాళిక. ఎందుకంటే ప్రజలకి, ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల వాళ్ళకి, మశూచి, అంటే అమ్మవారు, అనే మూఢనమ్మకం ఉండేది. మశూచి వచ్చిన వాళ్ళకి వేపమండలు వేసేవాళ్లు. మందులు వాడితే అమ్మవారికి కోపం వస్తుందని దూరంగా ఉంచి, అమ్మవారి శాంతికి పూజలు చేయడం, ఇలా ఉండేవి అప్పటి పరిస్థితులు.



అలాంటప్పుడు కుటుంబసభ్యుల్లో ఎవరికైనా మశూచి వస్తే ఇంటి నుంచి బయటకు వచ్చేవాళ్ళు కాదు.

ఇలాంటివన్నీ మశూచి నిర్మూలనకు అడ్డంకులుగా ఉండేవి. ఈ నేపథ్యంలో ప్రపంచ ఆరోగ్య సంస్థ వాళ్ళు ఊరూరూ వెళ్లి, అక్కడ ప్రజలకు నచ్చజెప్పి, కనుక్కోవటం పెద్ద సమస్యగా ఉండేది. టీకాలు వేసుకుంటూ వెళితే ఎంతమంది వస్తారు? సరే వచ్చిన వాళ్ళు ఒక చోటి నుంచి మరో చోటికి వెళితే వాళ్ళకు కూడా వేయాలి. ఇలాంటి సమస్యల వల్లనే 150 సంవత్సరాలుగా టీకాలు అందుబాటులో ఉన్నప్పటికీ మశూచిని అదుపు చేయలేకపోయారు.
రింగ్ వ్యాక్సినేషన్ అనే ఒక కొత్త ప్రణాళికను సిద్ధం చేశారు ప్రపంచ ఆరోగ్య సంస్థ వాళ్లు. రోగి ఎక్కడ ఉన్నాడో కనుక్కుని ఆ చుట్టూ ఉన్నవాళ్లకు టీకాలు వేయటం. ఈ పద్ధతి ఇతరదేశాల్లో సత్ఫలితాలు ఇచ్చింది. అదే పద్ధతిని భారతదేశంలో కూడా అమలు పరచాలనుకుంటున్నారు ప్రపంచ ఆరోగ్య సంస్థ వాళ్ళు.(మనం ఈ విశేషాలు చదువుతున్న రోజుల్లోనే చైనాలో కరోనా వైరస్ భీభత్సంగా చెలరేగిపోతుంది. ఇక్కడ కూడా ఇలాగే ఈ రింగ్ వాక్సినేషన్ అనే పద్ధతిని ఉపయోగిస్తున్నారు.) మశూచి టీకా కూడా అటువంటిదే.



భారత ప్రభుత్వం నుంచి అనుమతి రాగానే ప్రపంచ ఆరోగ్య సంస్థ కార్యక్రమాలు పూర్తి స్థాయిలో ప్రారంభమయ్యాయి. వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ బృందంలో విదేశాల నుంచి వచ్చిన డాక్టర్లు చాలా మంది ఉండేవాళ్ళు. ఇంకా వేలాది మంది వాలంటీర్లు ఉంటారు. వాళ్ళ పని ఊరూరూ వెళ్లడం, ఇంటింటికి తిరగడం, ఎవరింట్లో మశూచి రోగులు ఉన్నారో కనుక్కోవటం, అలా డాక్టర్లు, సిబ్బంది ఊరూరూ తిరగటాన్ని ఫీల్డ్ వర్క్, క్షేత్రకార్యాచరణ అంటుండే వాళ్లు.
1973 జూలై, ఆగస్టుల్లో ఫీల్డ్ వర్క్ మొదలైంది. ఇంక బ్రిలియంట్ విషయానికొస్తే ఆయన కేవలం గుమాస్తా మాత్రమే కదా! కొత్తగా వచ్చిన డాక్టర్లకి ట్రైనింగ్ మాన్యువల్ తయారు చేయడం, స్థానికంగా వచ్చే కార్యకర్తలకు రోజు వారి జీతాలు ఇవ్వటం. అలాగే ఈ ఫీల్డ్ లో జరిగే కార్యక్రమాలను ఏరోజు కారోజు కేంద్రకార్యాలయానికి నివేదించే గుమస్తా పనులు.

డాక్టర్ అయ్యుండి కూడా వైద్య సేవలు లేక పోతున్నాను అని మొదట్లో బాధపడే వాడు, కానీ 'చేసేది ఏదైనా చిత్తశుద్ధిగా చెయ్యాలి' అనే గురువు మాటను గుర్తుపెట్టుకుని డాక్టర్ని కలిసి ఫీల్డ్ వర్క్ లో ఇంటింటికి తిరిగేవాడు. ఎప్పుడూ భార్య గిరిజ కూడా వెంట ఉండేది.

**మీరట్ లో క్షేత్ర స్థాయి పనులు**



వాళ్ల ఫీల్డ్ వర్క్ మీరట్ లో 2011లో మొదలయింది. ల్యారీ అలా గుమాస్తాగానే వెళ్ళిపోయి ఉంటే, ఆయన గురించి ఇంత సేపు మాట్లాడుకునే అవసరం ఉండేది కాదు. అక్కడి నుంచి ల్యారీ పాల్గొన్న ప్రతి దశలోనూ తనని తాను నిరూపించు కునేలాగా పని చేసేవాడు. మొదట్లో ఇలా క్లర్కుగా పని చేసినప్పుడు, ఆ తర్వాత డాక్టరుగా పదోన్నతి పొందిన పిమ్మట, రెండేళ్ల పాటు ఉత్తర భారత దేశంలోని పల్లె పల్లెల్లో, అరణ్యాలలో, కొండల్లో, గుట్టల్లో తిరుగుతూ ల్యారీ అందించిన సేవలు, ఆయన ఎదుర్కొన్న సమస్యలు, ఆయన చేసిన సాహసాలు అన్నిటినీ ఈరోజుకు కూడా మనం మాట్లాడుకునే వ్యక్తిగా, ప్రత్యేకమైన వ్యక్తిగా, అద్భుత వ్యక్తిగా నిలబెట్టాయి.

**కరోలీ బాబా అనారోగ్యం**

ఆ వివరాలను మనం వరుసన తెలుసు కుందాం. ప్రపంచ ఆరోగ్యసంస్థ వాళ్లతో కలిసి ల్యారీ పనిచేయడం మొదలైన నెలరోజులకు కరోలి బాబా ఆరోగ్యం దెబ్బతిన్నది. గుండెల్లో నొప్పి వస్తుంది. వైద్యులు చికిత్స చేస్తున్నారు. వారాంతపు శలవుల్లో ల్యారీ బ్రిలియంట్, గిరిజ ఆయన దగ్గరకు వెళ్ళి వచ్చే వాళ్లు. ల్యారీ ఉంటే ఆయనతో బాబా గుండెలపై మందు రాయించుకునేవాడు.1973 సెప్టెంబర్లో కరోలీ బాబా కన్ను మూశాడు.

బాబా మరణించినప్పటికీ ఆయనకు ఇచ్చిన మాటను, నమ్మకాన్ని నిలబెట్టుకుంటూ ల్యారీ బ్రిలియంట్ ముందుకు నడిచాడు. తాను నమ్మిన విధానం, బాబా ఇచ్చిన విశ్వాసం అద్భుతమైన కలయిక. ఈ బాబా పరిచయం కేవలం రెండేళ్లు. ఇప్పుడు 76 సంవత్సరాల వయసులో కూడా ల్యారీ బ్రిలియంట్ కరోలీబాబాను గుర్తు చేసుకోకుండా ఉపన్యాసం ప్రారంభించడు, కొనసాగించడు.

అది తర్కానికి అందని ఒక అద్భుతమైన అనుభూతి, వాళ్ళిద్దరికే తెలియాలి. మళ్లీ మనం ల్యారీతో కలిసి ఫీల్డ్ వర్క్ గురించి తెలుసుకుందాం. మీరట్ లో మశూచి

గురించి ఏ పని చేసినా మార్పు ఉండేది కాదని చెప్పుకున్నాం కదా. దీనికొక ఉదాహరణ. పరిసర పల్లెల్లో ఇంటింటికి తిరిగాడు.

**విమానాలలో కరపత్రాల పంపిణీ**



మశూచి గురించి ప్రచారం చేయటానికి, ఎవరైనా రోగులు ఉంటే చెప్పమని గ్రామీణ ప్రాంతాల ప్రజలకి కరపత్రాలు పంచడం. ఇలాంటి కార్యక్రమం ఇంటింటికీ తిరిగి కరపత్రాలు పంచే కంటే ఒకేసారి ఈ కార్యక్రమం చేస్తే బాగుంటుంది అనుకున్నాడు ల్యారీ. రోజూ మీరట్ కు వెళ్లేటప్పుడు దారిలో అక్కడున్న మేజిస్ట్రేట్ రమేష్ పరిచయం అయ్యాడు. ల్యారీ ఆయనతో మాట్లాడుతుంటే ఈ ఆలోచన వచ్చింది. హెలికాప్టర్లో పైకి వెళ్లి అక్కడి నుంచి కరపత్రాలు విడుదల చేస్తే 12 గంటల్లోనే చాలా ప్రాంతాలకు కరపత్రాలను చేర్చవచ్చు. పైగా హెలికాప్టర్ నుంచి కరపత్రాలు పడుతుంటే ప్రజలు ఆకర్షింపబడతారు, ఆసక్తిగా, చూసి చదువుతారు అనే ఆలోచన వచ్చింది.

వెంటనే రమేష్ అగర్వాల్ ఢిల్లీ ఫ్లైయింగ్ క్లబ్ వాళ్ళతో మాట్లాడి, రోటరీ క్లబ్ సభ్యుల నుంచి విరాళాలు తీసుకుని ఒక రోజు హెలికాప్టర్లో ల్యారీ, మేజిస్ట్రేట్ గారు పైకి వెళ్ళి కరపత్రాలు వెదజల్లారు.

అప్పటికి కేవలం 29 సంవత్సరాల అమెరికా డాక్టర్ ఐక్యరాజ్య సమితి కార్యాలయంలో గుమాస్తాగా పనిచేసే వ్యక్తి మాత్రమే. అనుకున్న పని చాలా విజయవంతంగా పూర్తయింది. అసలు సమస్య అప్పుడే మొదలైంది.

ఈ కార్యక్రమాలను పర్యవేక్షించే భారత ప్రభుత్వ అధికారి గుణరత్నె గారు 'ఇదిగో, ఇలాగ అమెరికానుంచి వచ్చి, డాక్టరుగా పనిచేస్తున్న కుర్రాడు హెలీకాప్టరులో పైకి వెళ్లి కరపత్రాలు వేశాడు' అని తెలుసుకున్నాడు. ఆయన అగ్గిమీద గుగ్గిలం అయిపోయాడు.

'అసలు నువ్వు ఏమిటి? నీ ఉద్యోగం ఏమిటి? నీ వయసు ఎంత? నువ్వు ఎవరు? ఢిల్లీలో భారత భూభాగం మీద తిరగడానికి నీకు అనుమతి ఎవరు ఇచ్చారు?' ఇలా కేకలు వేయడం మొదలుపెట్టాడు. ఆ పని చేయబోయే ముందు లెటర్ ఇలాంటివి కావాలని ఆలోచించలేదు ల్యారీ. కార్యక్రమాన్ని విజయ వంతంగా ఎలాగా ముందుకు తీసుకెళ్లాలి అనుకున్నాడు.

గుణరత్నె గారు 'ఏది? నీ పాస్ పోర్టు తీసుకురా, ఐక్యరాజ్య సమితి డబ్బులు నీ ఇష్టం వచ్చినట్టు ఖర్చు చేస్తావా? నువ్వు అందరిలో చిన్న గుమాస్తా ఉద్యోగివి.' అని అరుస్తూనే ఉన్నాడు. కాని ల్యారీ హెలికాప్టర్ కు డబ్బు సంస్థనుంచి వాడలేదు. రోటరీ క్లబ్ వారు ఇచ్చిన చందాలనే అందుకు వాడాడు. రూపాయి కూడా సంస్థ నుంచి వాడలేదు. గాలిలో ఎగరడానికి అనుమతి తీసుకున్నట్లు ఆయన దృష్టికి తీసుకువచ్చారు.కర్తవ్యనిర్వహణలో ల్యారీ పొరపాటు ఏమీ లేదు. కానీ వెంటనే ఒప్పుకోడానికి అధికారి అహం అడ్డు వచ్చింది.

'సరే ఇక ముందు ఎప్పుడూ, ముందుగా మాకు చెప్పకుండా ఇలాంటి పనులు చేయవద్దు' అని హెచ్చరించి వదిలేసాడు ల్యారీని. ఈ మశూచి కార్యక్రమం అంతా

పూర్తి అయిన తర్వాత ల్యారీని అభినందిస్తూ ఇచ్చిన బహుమతిని గుణరత్నె గారి చేతులమీదుగానే అందుకున్నాడు ల్యారీ.

తర్వాత రోజుల్లో ల్యారీ చేసిన సాహసాలకు ఇది ఆరంభం. తరువాత చేసినవి నెమ్మదిగా తెలుసుకుందాం. ఆయన కేవలం గుమస్తా అయినా మశూచి గురించి ప్రజలకు తెలియజేసే విధానాల్లో కొత్త ప్రయోగాలు చేశాడు. ఎవరైనా సరే ఫలానా చోట మశూచి రోగి ఉన్నాడు అని చెబితే ఐదు రూపాయలు బహుమతి అని ప్రకటించారు, కొన్ని ఊళ్లలో చుట్టుపక్కల కళాకారులను తీసుకెళ్లి కార్యక్రమాలు, సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేసి, మశూచి గురించి వివరించే వాళ్ళు. డాక్టర్ ల్యారీ తో కలిసి పని చేయటం వైద్యసిబ్బందికి చాలా హుషారుగా ఉండేది. ఫీల్డ్ వర్క్ కు ఏ మూలకైనా, ఎక్కడికైనా వెళ్లటానికి ల్యారీ వెనకాడడు.



**జీపు బోల్తా, తప్పిన ప్రమాదం**

ఒకసారి ల్యారీ బృందం కొండల మీద, కనుమ దారిలో వెళ్ళేటప్పుడు జీపు తిరగపడింది. ఆ ప్రమాదంలో ల్యారీకి మెడ నరాలు బాగా పట్టేశాయి. వైద్యులు ‘ పర్వాలేదు, కానీ చాలా జాగ్రత్తలు తీసుకోవాలి’ అని చెప్పారు. ఈ విధంగా ల్యారీ బ్రిలియంట్ క్లర్క్ జీవితం ఆర్నెల్లు గడిచింది.

1973 లో ల్యారీ చేస్తున్న పనితనం అంతా చూసి ప్రోగ్రాం డైరెక్టర్ గా ఉద్యోగం పెంచటానికి అంగీకరించారు. అప్పుడు ఇంకో అడ్డంకి వచ్చింది.

ల్యారీ వీసాపై, భారతదేశంలో 1973 డిసెంబరు వరకు మాత్రమే ఉండవచ్చు. ఆ తరువాత తప్పనిసరిగా అమెరికా వెళ్ళి పోవాల్సిందే. అమెరికా నుంచి క్లియరెన్స్ కూడా రాలేదు. అలా తప్పనిసరి పరిస్థితులలో 1973 డిసెంబరులో, భార్య గిరిజతో

కలిసి అమెరికా వెళ్ళిపోయాడు. పుట్టి పెరిగిన దేశం అయినా అమెరికా కొత్తగా ఉంది. ఇండియాలో ఉన్నది కొన్నాళ్లే అయినా, జనసమ్మర్ధం ఇవన్నీ గుర్తొచ్చి, 'ఇండియా చాలా కలర్ ఫుల్ గా ఉండేది, అమెరికా బ్లాక్ అండ్ వైట్ లాగా అనిపించింది' అని రాసుకున్నాడు ల్యారీ. వాళ్ళమ్మ, అత్తగారు ల్యారీని, గిరిజను చూసి బాధ పడ్డారు.

తమ్ముడు అడిగాడు ఎందుకురా? అన్నయ్యా, మనదేశంలో పరుగులు పెడుతున్నావా? నిజానికి డబ్బులు విషయం గురించి మాట్లాడు కోవాలంటే ల్యారీకి భారతదేశంలో క్లర్కుగా పని చేస్తున్నప్పుడు 500 ఇచ్చేవాళ్ళు. అదే ఆయన అమెరికాలో ఉంటే ఒక వారాంతంలో అత్యవసరరోగులను చూస్తే, ఎమర్జెన్సీ డాక్టరుగా ఇంకా ఎక్కువ వచ్చేవి.

అయినా ఆయనకు ఒకే ఒక ధ్యేయం. *'మశూచిని నిర్మూలించ వచ్చు'* అని మహారాజ్ చెప్పగా పూర్తిగా హృదయపూర్వకంగా నమ్మి తాను అక్కడికే వెళ్లాలని ఉవ్విళ్లూరుతున్నాడు. ఇప్పుడు అమెరికాలో ఉద్యోగం ఇచ్చిన కుర్రవాడు 30 సంవత్సరాల యువకుడు.

భారతదేశంలో ఇంటింటికీ తిరిగి అందులో ఆదాయం లేకుండా, ఏ మాత్రం స్వార్థం లేకుండా పని చేయాలి. మశూచి నిర్మూలన తన లక్ష్యం, ధ్యేయం. అలాంటి అద్భుతవ్యక్తి ఇంట్లో వాళ్ళకు ఇలా చెప్పాడు. 'డబ్బుల కోసం అయితే ఇక్కడే ఉండే వాడిని, నాకు ఒక ఇష్టం ఉంది. ఆ లక్ష్యాన్ని పూర్తి చేయడం కోసం 30 సంవత్సరాల వయసులో అమెరికాలో అన్ని సౌకర్యాలు ఉన్న జీవితాన్ని కాదనుకుని భారతదేశం - **India- Something Special With Larry Brilliant** తనకు చాలా ప్రత్యేకమైనదని తన డైరీలో రాసుకున్నాడు. నాయకుడు ఎప్పుడూ అగ్నిగుండం మధ్య నిలబడి ఎలా బయటికి రావాలని ఆలోచించడం, అ ప్రణాళికలను అమలు పరచడం

అంటే నాకు చాలా ఇష్టం. అందుకే ఇండియాలో మశూచి నివారణ పూర్తయ్యేదాకా దేశాన్ని వదలకూడదని నిశ్చయించుకున్నాను.

ఇంట్లో వాళ్ళ నాన్న, వాళ్ళ తాత మరణాలు. ఇండియాలో ఉండగా జీపు ప్రమాదంలో మెడ పట్టేసింది కదా? అది మళ్ళీ బాధించటం మొదలు పెట్టేసరికి అక్కడ డాక్టర్లు చెప్పారు. 'కొన్నాళ్ల పాటు విశ్రాంతి తీసుకో, లేదంటే సర్జరీ చేస్తాము. విశ్రాంతి తీసుకోవాల్సిందే'.

అమెరికాలోనే ఉండిపోవడానికి సిద్ధంగా లేదు ల్యారీ. మిత్రులు నీకేమైనా పిచ్చా? అని మందలించారు. ఇండియా వెళ్లి పాత జీవితం మళ్లీ కొనసాగిస్తావా? అని. రియల్ సీన్ వ్యాయామాలు చేయడానికి ఏదో ఒక పనిముట్టు ఇచ్చారు. ఇలా జరుగుతున్న కొద్ది రోజుల్లోనే అమెరికా ప్రభుత్వం నుంచి FBI క్లియరెన్స్ వచ్చింది. దాంతో పాటుగా యూనియన్ నుంచి ప్రత్యేక పాస్ పోర్టు వచ్చింది. దీనితో ఆయన మెడికల్ ఆఫీసర్ గా పని చేయడానికి అనుమతి దొరికినట్లే. అమెరికా నుంచి భారతదేశంలోని మిత్రులకు తీసుకు వెళ్లవలసిన నాలుగైదు పెట్టెల సామాన్లు, ఒక ఎర్ కండిషనర్ కూడా పెట్టుకున్నాడు.

ఆలోచించండి, రెండు సంవత్సరాల క్రిందట భార్య, భర్త కేవలం చెరొక వీపుసంచి మాత్రమే వేసుకుని వెళ్ళిన వాళ్ళు, నేడు భారీ సామానుతో భారతదేశానికి ప్రయాణం అవుతున్నారు. మొట్టమొదటిసారి వెళ్ళినప్పుడు వాళ్ళకేమీ తెలియదు, లక్ష్యము లేదు. నెల రోజుల పాటు అమెరికా వెళ్లి వచ్చాక ఇప్పుడా రెండూ ఉన్నాయి.1974 జనవరి 26 రిపబ్లిక్ దినోత్సవం రోజున మళ్లీ ఢిల్లీలో దిగారు ల్యారీ, గిరిజ.

ఉత్తరప్రదేశ్ లో మశూచి అదుపులోకి వచ్చింది.ఆరు నెలల్లో ల్యారీకి భోపాల్ లో ఉద్యోగం ఇచ్చి అక్కడ బాధ్యతలు అప్పగించారు. భార్యతో కలసి మెడికల్ ఆఫీసర్ గా వెళ్లాడు. ఈ సంఘటన జరిగి ఇప్పటికి 45 సంవత్సరాలు దాటుతున్నా ఇప్పటికీ ల్యారీ

ఆరోజు తనతో పనిచేసిన భారతీయులను పేరు పేరున గుర్తు చేసుకున్నాడు 'సమ్ టైమ్స్ బ్రిలియంట్' అనే పుస్తకంలో.

ఇండియాలో తనకు పరిచయమైన వారందరిలో హీరో అని ప్రత్యేకంగా ఆయన జాఫర్ హుస్సేన్ పేరు చెప్పారు. ఆయన పారామెడికల్ ఉద్యోగి. ల్యారీ బ్రిలియంట్ భోపాల్ లో దిగగానే పరిచయమైన వ్యక్తి జాఫర్. ఆయన అంతకు ముందు శానిటరీ ఇన్స్పెక్టరుగా, సహాయకుడిగా, మెడికల్ అసిస్టెంటుగా పని చేసాడు.తరువాత ల్యారీని వెన్నంటి ఉన్నాడు.

ల్యారీ ఉద్యోగంలో చేరినప్పటినుంచి తర్వాత మూడేళ్లు ఇండియాలో ఉన్నన్ని రోజులూ ఆయనకి సహాయకుడిగా ఉండటమే కాకుండా ల్యారీ చేసిన సాహసాలు అన్నింటిలో కూడా తోడుగా ఉన్నాడు జాఫర్ హుస్సేన్.

భోపాల్ వచ్చి, అక్కడ స్థిరపడుతుండగానే ల్యారీకి సవాలు ఎదురయింది. మశూచి పెరుగుతుంది. ఆ రోగులను వీలయినంత త్వరగా కనుక్కోవాలి. అక్కడ ఆ క్రమంలో భోపాలుకి దగ్గరలో ఉన్న గ్వాలియర్ జైల్లో ఖైదీలను కలిసివస్తున్న వాళ్ళవల్ల మశూచి మధ్యప్రదేశ్ అంతటా వ్యాపిస్తుందని తెలిసింది. అక్కడికి వెళ్లి చూడటానికి ఎవరైనా డాక్టరును పంపాలంటే ఎవ్వరూ అక్కడికి వెళ్ళడానికి సిద్ధంగా లేరు. గ్వాలియర్ జైలుకి వెళితే మళ్లీ వెనక్కి తిరిగిరారని అక్కడి వారి భయం.

ల్యారీ వెళ్లి విచారించాడు. అక్కడి జైలు కాపలాదారుకు బీహారులో మశూచి అంటుకుంది. ఆయన నుంచి ఒక గొలుసు ప్రతిచర్య లాగా మధ్యప్రదేశ్ అంతా కూడా పాకుతుంది. ఇప్పుడు చేయాల్సిన పని ఏంటి? గ్వాలియర్ జైలుకి వెళ్ళి అక్కడి ఖైదీ లందరికీ టీకాలు వేయాలి. ఇది అంత సులభంగా సాధ్యమయ్యే పని కాదు. జైల్లోని ఖైదీలు చాలా మొండి వాళ్ళు. కరడు కట్టిన నేరగాళ్లు. వాళ్లలో ఒక భయంకర

నేరస్తుడు మాన్సింగ్. అతను పాతిక పైగా హత్యలు చేసి జైలు శిక్ష అనుభవిస్తున్నాడు. ఇలాంటి వాళ్ల దగ్గరికి వెళ్లడానికి ఏ డాక్టర్ ముందుకు వస్తాడు?



అందుకే మన ల్యారీ ముందుకు వచ్చాడు. మాన్సింగ్ కు కనక టీకా వేయగలిగితే మిగతా అందరికీ కూడా ఇవ్వడం తేలిక. కాని అతని దగ్గరకి వెళ్ళడానికి ఎవ్వరికీ ధైర్యం చాల్లేదు. ల్యారీ ఒక జైలర్ సహాయంతో మాన్ సింగ్ గదికి వెళ్ళాడు. డా. ల్యారీ హిందీలో మాట్లాడడం మొదలు పెట్టాడు. మాన్సింగ్ నుంచి జవాబు వచ్చింది. ఆ గదిని పరిశీలిస్తుండగా ఒక మూలన చిన్న హనుమాన్ ఫోటో కనిపించింది. ల్యారీ ముందుకు దూసుకు పోవటానికి ఉపాయం తట్టింది. 'మాన్సింగ్, నేను కూడా హనుమాన్ భక్తుడినే. హిమాలయాల్లో ఉన్నపుడు రోజూ హనుమాన్ దేవాలయానికి వెళ్తుండేవాడిని. హనుమాన్ అంటే లక్ష్మణుని బ్రతికించడానికి సంజీవిని తెచ్చిన బలశాలి. మహమాన్వితుడు.

మరి నువ్వు కూడా హనుమాన్ భక్తుడివి కాబట్టి మన చుట్టూ ఉండేవాళ్లను రక్షించడానికి టీకాలు వేయించుకోవాలి. నువ్వు వేయించుకుంటే మిగతావారు వేయించు కుంటారు' అని నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు ల్యారీ. అంత తొందరగా మెత్తబడ లేదు మాన్సింగ్.

ల్యారీ తనకు వచ్చిన భగవద్గీతా శ్లోకాలను చదువుతూ కృష్ణుడు అర్జునుడికి కర్తవ్య బోధ ఎలా చేసాడు? ఇలాంటివన్ని చెప్పేసరికి కరుడుగట్టిన ఆ గజదొంగ కూడా కొంచెం,కొంచెం కరగడం మొదలు పెట్టాడు.

నువ్వు ఏదో దేశం నుంచి వచ్చావు.అయినా, మా పురాణాల గురించి నువ్వు చెప్పిన దాంట్లో నిజం ఉన్నట్లు అనిపిస్తుంది. కానీ  నాకు టీకా అంటే చాలా భయం. ఆ సూదిమందు నేను భరించలేనేమో అన్నాడు మాన్సింగ్. అసలు దారికి వచ్చాడు కదా అని సంతోషిస్తూ ల్యారీ చెప్పాడు ఏమీ నొప్పి ఉండదు, కావాలంటే చూడు అని తనకు తాను టీకా వేసుకోని చూపించాడు డా.ల్యారీ.

ఇలాగ ఒకసారి కాదు, భవిష్యత్తులో కూడా ఎవరైనా టీకాలు వేయించుకోవటానికి భయపడుతుంటే  తనకు తానే టీకా వేసుకునే వాడు ల్యారీ. అది చూసేసరికి అంత కరుడుకట్టిన  మాన్సింగ్ కూడా పూర్తిగా సన్నద్ధం అయ్యాడు. ఒక్క నిమిషం ఆగు, బయట ఆరుబయట చెట్టు కింద కూర్చో, చేస్తాను, నిన్ను చూసి మిగతా ఖైదీలు కూడా వేయించుకుంటారు అని మాన్సింగును ఆరుబయటకు తీసుకువెళ్ళి అరుగుపైన కూర్చోమన్నారు. ల్యారీ, ఐక్యరాజ్య సమితి మెడికల్ ఆఫీసర్ అంటే అదీ విషయం. ఇది జరిగాక మిగతా ఖైదీలందరూ కూడా వరుసలు కట్టి వచ్చారు. అందరికీ టీకాలు వేశారు. ఆ విధంగా ల్యారీ చేసిన  సహాయం సత్ఫలితాలను ఇచ్చింది. గ్వాలియర్ జైలు పరిసరాల నుంచి మశూచి ఎగుమతి ఆగింది. వీటన్నిటికీ కారణం ల్యారీ బ్రిలియంట్, అతని బృందం కూడా.

*ల్యారీ ముందుండి ఇలాంటి సాహసాలు ఎన్నో చేశాడు. అన్నిట్లో అందరిలోకి ముందుండి నడిపించాడు కాని అయనతో పాటు పనిచేసేబృందం ఎప్పుడూ ఇలాంటి సాహసాలు చూడలేదు.  ల్యారీ సాహసాల వల్లే ఆయన ప్రత్యేక వ్యక్తి, అద్భుత శక్తి అని ఎప్పటికీ మాట్లాడుకోవడానికి మనం ఏమాత్రం సందేహించ వలసిన అవసరంలేదు.*

అయితే ఆయనతో పనిచేసిన కార్యకర్తల్లో కొంతమంది క్రింది స్థాయి వాళ్ళు ఉంటారు కదా మరి వాళ్ళలో అవినీతి సహజంగానే ఉంటుంది. ఒకసారి టీకాల  ఇన్ స్పెక్టర్ దగ్గర పనిచేసే ఉద్యోగి గ్రామీణ ప్రాంతాలకు వెళ్లి మేము మీకు రష్యన్ టీకా వేస్తాము.

అయితే దానివల్ల దురద వస్తుంది. పైగా రష్యన్ టీకా ఉచితం కదా అని వేయించుకుంటే మీరు కమ్యూనిస్టులు అయిపోతారు. రెండు రూపాయలు ఇస్తే మీకు కెనడా టీకా వేస్తాను. ఐదు రూపాయలు ఇస్తే అసలు టీకా వేయకుండానే వేసినట్లుగా సర్టిఫికెట్ ఇస్తాను. అని అమాయక గ్రామీణ ప్రజలను భయపెట్టడం మొదలు పెట్టాడు. ఈ విషయం సహాయకుడిగా ఉన్న జాఫర్ హుస్సేన్ కు తెలిసింది. ఆయన ల్యారీకి చేప్పాడు. ల్యారీ ఆ టీకాల ఉద్యోగిని మందలించి, పదవి నుంచి తొలగించాడు.

ఇలాంటివన్నీ కూడా ఒకవైపు నిర్వహించుకుంటూనే, తన కార్యక్రమాల్లో కొత్తగా ఏం చేయాలని ఆలోచిస్తూ, వెనకాడ కుండా ముందుకు వెళ్ళారు ల్యారీ. ఆయన చేసిన మరో పెద్ద సాహసం గురించి తెలుసుకుంటే చాలా ఆశ్చర్యం వేస్తుంది. వైద్య సదుపాయాలు ఉన్నాయి, సిబ్బంది ఉన్నారు, సహాయం ఉంది, డబ్బులున్నాయి. యు.యన్.ఓ. మార్గదర్శకత్వం ఉంది, భారతదేశ ప్రోత్సాహం ఉంది. ఇవన్నీ ఉండి కూడా మశూచి నిర్మూలన ఆ రోజుల్లో ఎంత సంక్లిష్టంగా ఉండేదో ఇదుగో ఇప్పుడు చెప్పబోయే ఆయన చేసిన మరొక సాహసం వల్ల తెలుస్తుంది.

ఏం జరిగిందంటే 1974 మధ్యకు ఇండియాలో మశూచి నిర్మూలన కార్యక్రమం ( National Smallpox Eradication Programme) విజయవంతంగా పూర్తి చేయాలని ప్రపంచ ఆరోగ్య సంస్థ లక్ష్యాన్ని నిర్దేశించు కున్నది. 1973 జూన్ , జూలైలో మొదలు పెట్టి ఏడు, ఎనిమిది నెలల్లోనే పూర్తి చేద్దామనుకున్నారు. అలా జరిగింది కూడా. 1974 వచ్చేసరికి మార్చ్ ఏప్రిల్ కల్లా దాదాపుగా తగ్గిపోయింది అనుకుంటుండగా మళ్లీ హఠాత్తుగా బీహార్, మధ్యప్రదేశ్, ఉత్తర ప్రదేశ్ ఇంకా కొన్ని ఒరిస్సా ప్రాంతాల్లో కొత్త మశూచి రోగులు నమోదవడం మొదలైంది. పదుల కొద్దీ టెలిగ్రాములు ఐక్యరాజ్య సమితి కార్యాలయానికి వస్తూ ఉండేవి.

ప్రపంచ ఆరోగ్య సంస్థ ఉలిక్కి పడింది. ఒక్కసారిగా ఆశ్చర్యమేసింది. ఉన్నట్టుండి కేసులు ఎందుకు పెరుగు తున్నాయి! క్రిందటి నెలనుంచే ఎందుకు మొదలు అవుతున్నాయి? ల్యారీ పని చేస్తున్న మధ్యప్రదేశ్ లో కూడా ఒక దానికొకటి సంబంధం లేని ఊళ్ళ నుంచి వచ్చిన రోగుల వివరాలను తన మనుషుల ద్వారా సేకరించాడు. మశూచి వల్ల చనిపోయిన వాళ్ళలో దాదాపు అందరూ 25 -30 ఏళ్ల వయసున్న నిరుద్యోగులు. వాళ్ళు ఎక్కడికి వెళ్లారు? ఉద్యోగం చూసుకోవడానికి వెళ్లి, అక్కడి నుంచి వచ్చి ఈ మశూచితో చనిపోయారు అని ఒక చిన్న ఆధారం దొరికింది ల్యారీకి. పోనీ వాళ్ళు ఎక్కడికి వెళ్ళివచ్చారో తెలుసుకుందామంటే వచ్చిన వాళ్ళు మాట్లాడడం కూడా లేని పరిస్థితుల్లో మరణించారు. అట్లా వాళ్ళు వెతకగా, వెతకగా నాలుగైదు రోజులకి ఒక రోగిని గమనిస్తే అతని జేబులో బీహార్ లోని టాటా నగర్ నుంచి (ఇప్పుడు జంషెడ్పూర్ అంటున్నారు) వచ్చినట్లు రైల్వే టికెట్ ఉంది. ఆ చిన్న ఆధారంతో ల్యారీ రైల్వే టైమ్ టేబుల్ తెప్పించారు. విశ్లేషించి చూడగా తెలిసింది ఏమిటంటే కొత్తగా వచ్చిన మశూచి కేసులన్నీ కూడా టాటా నగర్ నుంచే వచ్చాయి. అక్కడి నుంచి రైళ్లు బయల్దేరి ఎక్కడెక్కడికో వెళ్తాయి. ఆ మార్గంలో గ్రామాలు ఉన్నాయి. అలా టాటానగర్ నుంచి మశూచి వ్యాధి ఎగుమతి అవుతుంది అని రూఢి అయింది. టాటా నగర్ ను ఆ రోజుల్లో 'భారతదేశపు పిట్స్ బర్గ్' అనే వాళ్ళు.

ఈ నగరంలో టాటా సంస్థలకు చెందిన ఉక్కు ఫ్యాక్టరీలు, బొగ్గు గనులు చాలా ఎక్కువగా ఉన్నాయి. పక్క రాష్ట్రాల నుంచి అనేక మంది కుర్రాళ్ళు ఉద్యోగాల కోసం టాటా దగ్గరికి వెళ్తుండేవాళ్ళు. ఉద్యోగం దొరికిన వాళ్ళు అక్కడ ఉండే వాళ్ళు. లేని వాళ్లు మళ్లీ వెనక్కి వెళ్లిపోవడం, కొన్నాళ్ళు అక్కడ ఉండడం ఇలాంటి క్రమంలో అక్కడెక్కడో మొదలైన మశూచిని నిరుద్యోగ ప్రయాణికులు ప్రక్క రాష్ట్రాల అన్నింటికీ కూడా అంటిస్తున్నారు అన్నమాట. దీనికి కూడా కారణం ఉంది. టాటా నగర్ కు వచ్చాము, మశూచి వ్యాధి వల్ల ఎలాగూ చనిపోతాం. అదేదో సొంత ఊరు వెళ్లి

చనిపోతే బాగుంటుంది కదా అనుకొని ఆ రైళ్ళల్లో ప్రయాణించడం, త్రోవలో మరింత మందికి దానిని అంటించడం, ఇలాగ వ్యాధి వ్యాప్తి జరుగుతుందని రూఢి అయ్యింది ల్యారీకి.




ఆయన హుటాహుటిన తన సహాయకుడు జాఫర్ హుస్సేన్ ను కలిసి రైల్లో టాటానగర్ కి వెళ్ళాడు. రైల్వే స్టేషన్ నుంచి దిగగానే ఇలాగా మశూచిని నిర్మూలించే వాళ్ళు వచ్చారు అని తెలుసుకుని ఒక నడి వయస్కురాలు ఒక పసిబిడ్డను తీసుకొచ్చి డా. ల్యారీ చేతిలో పెట్టింది. 'బాబూ, నాలుగైదు రోజులుగా బిడ్డకి అమ్మవారు పోసింది, మూసిన కన్ను తెరవటం లేదు, మీరేదో టీకాలు వేస్తే బ్రతుకుతాడు అంట కదా' అని ఆశగా, జాలిగా చెపుతూ జవాబు కోసం డాక్టర్ వైపే చూస్తుంది. ల్యారీ బిడ్డని చేతిలోకి తీసుకోగానే తెలిసిపోయింది. వళ్ళంతా కురుపులు, కళ్ళ మీద కూడా కురుపులు, బిడ్డ శరీరం చల్లగా ఉంది. అంటే అప్పటికే బిడ్డ చనిపోయింది.అదే చెప్పాడు ఆ తల్లికి. ఆమె గుండెలు బాదుకుంటూ ఏడవసాగింది.

ల్యారీ చలించిపోయాడు. ఇదొక్కటే కాదు, టాటానగర్ వీధుల్లో వెళ్తుంటే ఎటు చూసినా శవాల గుట్టలే అన్నట్లుగా ఉంది పరిస్థితి. టాటా నగర్ లో ఉన్న పెద్ద కంపెనీ TISCO టిస్కో, టాటా ఇండస్ట్రియల్ స్టీల్ నిర్మాణ సంస్థ.. వాళ్ల ఆసుపత్రికి వెళ్లాడు ల్యారీ. ఆయన వెళ్లిన ఒక్కరోజులోనే పాతిక మందికి పైగా కొత్తగా మశూచి సోకిన

వాళ్ళు ఆసుపత్రిలో చేరారు. అందరికీ సరిపడే పడకలు లేక వరండాలో పడుకోబెట్టారు. ప్రక్కనున్న గవర్నమెంటు ఆసుపత్రిలో మరో 15 కేసులు వచ్చినట్లు తెలిసింది. గత ఏడాదిగా పని చేస్తున్నప్రటికీ ల్యారీ ఎప్పుడూ ఒక్క రోజులో ఇలా 40 – 50 కొత్త కేసులు రావడం చూడలేదు.

సరే టాటా ఆసుపత్రి డాక్టర్ ని ఏం చికిత్స చేస్తున్నారు? అని అడిగాడు. ఆ డాక్టర్ చాలా నిర్లక్ష్యంగా, నిర్లిప్తంగా ' చేయడానికి ఏమీ లేదు, నా దగ్గర డబ్బులు లేవు, నేనేమో గవర్నమెంట్ డాక్టర్ని. జీతం మాత్రం ఇక్కడ టాటా వాళ్ళు ఇస్తున్నారు. పై వాళ్లకి మశూచి వచ్చిందని చెప్పాను. వాళ్ళెవరూ నాకేమీ సహాయం పంపలేదు. నేనేం చేయ గలను,అలాగే ఉండిపోయా'అని నిర్లక్ష్యంగా చెప్పాడు.




ల్యారీ కి బాగా కోపం వచ్చింది. తాము చేస్తున్నదేమిటి! ఇక్కడ జరిగేదేమిటి దాదాపుగా మాయం అవుతుంది అనుకుంటున్న మశూచి ఇక్కడ మరల జడలు విప్పి నర్తిస్తోంది. ఈ పోరాటంలో ప్రపంచ ఆరోగ్య సంస్థ ఓడిపోతుందా! అదే జరిగితే ఇంతవరకు సంస్థ చేసిన శ్రమ అంతా కూడా వృధా అయినట్లేనా!! ఇవన్నీ ఆలోచించుకుంటూ ఆగలేక పోయాడు ల్యారీ. నిబ్బరించుకొని, 'సరే, అసలు

యజమానులు ఎవరు?' అని అడిగాడు. ఆయన ద్వారా ఆ ఆసుపత్రి టిస్కో మేనేజింగ్ డైరెక్టర్, రూసి మోడీ అని తెలుసుకున్నాడు.

మోడీ ఇల్లు వెతుక్కుంటూ బయలుదేరాడు ల్యారీ. రాత్రి 10 గంటలు దాటింది. సహాయకుడు జాఫర్ చెప్పాడు 'సార్ రాత్రి చాలా పొద్దుపోయింది, ఈ సమయంలో అంత పెద్ద వాళ్ళు తలుపులు తెరచి ఉంచరు. రేపు పొద్దున్నే వెళ్దాము' అన్నాడు. మారుమాటాడకుండా ల్యారీ ముందుకు సాగాడు. ఆ ఇంటి ముందు నుంచి వచ్చినప్పుడు ల్యారీకి కళ్ళముందు రైల్వే స్టేషనులో చనిపోయిన బిడ్డతో ఏడుస్తున్న పిచ్చితల్లి మొహం కనబడింది.

బంగ్లా గేటు మూసి ఉంది. గేటు లోపలికి వెళ్లి తలుపు కొట్టాడు. వంట మనిషి కావచ్చు, వచ్చి తలుపులు తీశాడు. ఎవరు కావాలి? ఇంత రాత్రి పూట ఎందుకు వచ్చారు? అన్నాడా వంటమనిషి.

రూసీ మోడీ గారి ఇల్లు ఇదేనా? అని బిగ్గరగా అరిచాడు ల్యారీ. అవునన్నాడు వంటమనిషి. అంతే, ఏమీ ఆలోచించకుండా వంట మనిషిని పక్కకు నెట్టేసి లోపలికి దూసుకెళ్ళాడు. మరి మోడీ లాంటి వాళ్ళు అంత సాధారణంగా ఉండరు కదా! ఎక్కడినుంచో ఒక పెద్ద వేట కుక్క పరుగున వచ్చింది. ఒక్కసారిగా ల్యారీ చేతిని మణికట్టు వద్ద పట్టుకుంది. దాని కోరల స్పర్శ తెలుస్తుంది ల్యారీకి. తన చెయ్యిని ఏమాత్రం కదిలించినా ఆ కుక్క పళ్లు తన చేతిలో దిగుతాయి. అలాగే ఉంటూ ల్యారీ ధైర్యంగా 'రూసీ మోడీ ఎవరు?' అని అడిగాడు. డైనింగ్ టేబుల్ దగ్గర ఇద్దరు భోజనానికి కూర్చున్నారు. అందులో ఒకాయన 'నేనే రూసీ మోడీని, నువ్వు ఎవరు?' అదేమిటి అలా ఉన్నావు? ఇంత రాత్రి పూట మా ఇంటికి బలవంతంగా రావాల్సిన అవసరం ఏమిటి?

'నేను మీ ఇంటికి రావడం కాదు, మీరు ఇంటి నుండి ఒక్క అడుగు బయటకు వచ్చి చూడండి. మీ ఫ్యాక్టరీని పెంచి పోషిస్తున్న ఈ ఊర్లో మశూచి మహమ్మారి విజృంభించింది. మీ వాళ్లే మశూచిని ఎగుమతి చేస్తున్నారు. మశూచిని మాత్రమే కాదు, చావులను కూడా వేరే చోటికి ఎగుమతి చేస్తున్నారు. ఇంత జరుగుతుంటే ఈ నగరంలో అతిపెద్ద ఫ్యాక్టరీ యజమానిగా మీరేం ఏమి చేస్తున్నారు?' అడిగాడు ల్యారీ ఏకబిగిన.

మోడీకి ఆశ్చర్యమేసింది. పరిస్థితి చాలా తీవ్రంగా ఉందని అర్థం అయింది. కుక్కను అదుపులో పెట్టమని సైగచేశాడు. ల్యారీని తన పక్కన కూర్చోమని ఆహ్వానించాడు. ల్యారీ ద్వారా ప్రస్తుత పరిస్థితులను వివరంగా తెలుసుకొని ఆశ్చర్య పోయాడు మోడీ.

'క్షమించాలి, నిజంగా ఈ విషయాలు, ఈ తీవ్రత గురించి నాకు తెలియదు. వాళ్లెవరూ నాకు చెప్పలేదు. ఇంక నేను బాధ్యత తీసుకుంటాను. దీనికి మీరు ఏ సహాయం కావాలన్నా, మేము ఇస్తాము, రేపు పొద్దున్నే రండి, బొంబాయిలో ఉన్న జెమ్ షెడ్జీ టాటాతో మాట్లాడదాం అన్నారు.

మర్నాడు ఉదయం ఎనిమిది గంటలకల్లా 30 ఏళ్ల అమెరికన్ డాక్టర్ ల్యారీ బ్రిలియంట్ భారతదేశ పారిశ్రామిక దిగ్గజం టాటా తో ఆయన హెడ్ క్వాటర్స్ లో కాన్ఫరెన్స్ కాల్ లో కలిశాడు.

ఒక్కసారి చూడండి ఒక మనిషి ఒక సాహసం, ధైర్యం ఉంటే ఎంతటి అద్భుతాలనైనా చేయవచ్చు. టాటాతో ఆ రోజుల్లో మాట్లాడాలంటే ఎంత కష్టంగా ఉండేదో! అలాంటిది ల్యారీ చేసిన ఒక సాహసం. టాటా అంతా మనసు పెట్టి విన్నాడు. మీకేం కావాలో చెప్పండి,

ఈ కార్యక్రమానికి పూర్తి సహకారం అందిస్తాము, ఇంతవరకూ ఈ సమస్య తీవ్రత మా దృష్టికి రాలేదు. అని ఒప్పుకొని వాగ్దానం చేయడమే కాకుండా ఆ తర్వాత 72 గంటల్లో ల్యారీ బృందానికి టాటా గ్రూప్ నుంచి విస్తృత మద్దతు లభించింది.



ఇండియాలో వివిధ నగరాల్లో టాటా ఆసుపత్రుల్లోని అత్యవసర విభాగాలు తప్ప మిగతా అన్ని శాఖల్లో ఉన్న డాక్టర్లను అందరిని రప్పించారు. వారిని డాక్టర్ బ్రిలియంట్ బృందంలో కార్యకర్తలుగా మార్చేశారు. మిగతా ఫ్యాక్టరీ అంతటిలో టిస్కో కేంద్ర కార్యాలయంలో అవసరమైన అన్ని గదులను మశూచి నిర్మూలన బృందానికి కేటాయించారు. అంత వేగంగా చేస్తున్న మార్పులు మశూచిపై జరిపే ఆఖరిపోరాట ఏర్పాట్లు అన్నట్లున్నాయి.

రోగులను కనుక్కోవటం, జల్లెడ పట్టడం మొదలు పెట్టారు ల్యారీ నేతృత్వంలో వైద్య సిబ్బంది. వెంటనే అక్కడ ఉన్న వాళ్ళకి చికిత్స తక్షణ కర్తవ్యం. అంతకంటే ముందు రోగులు అక్కడ నుంచి బయటికి పోకుండా చూడాలి. ఎలాగా ! టాటా నగరం నుంచి ఒక్కరు కూడా బయటకు రాకూడదు, లోపలి వాళ్లు బయటకు వెళ్లకూడదు, బయట వాళ్ళు ఎటునుంచి కూడా లోనికి రాకూడదు. అంటే టాటా నగరం అంతా అష్టదిగ్బంధం (quarantine) చేయాలి.

కాని టాటానగర్ చిన్న పల్లెటూరు కాదు. మొత్తాన్ని క్వారంటైన్  చేయాలంటే ఆ మహానగరంలో ఎన్నో వ్యాపారాలున్నాయి. ఆ నగరాన్ని అష్టదిగ్బంధనం చేయడం ఎలా సాధ్యమని సందేహించలేదు. చకచక ప్రణాళికలు వేశాడు.

నగరానికి బయట కీలక ప్రాంతాల్లో శిబిరాలను ఏర్పాటు చేసాడు. బయటకు వెళ్లాలన్నా, లోనికి రావాలన్నా టీకాలు తప్పకుండా వేయించుకోవలసిందే. బస్సు స్టాండ్, రైల్వేస్టేషన్ లలో వందలమంది ఆరోగ్య కార్యకర్తలను పురమాయించాడు. టీకాలు వేయించుకుంటే తప్ప టికెట్లు అమ్మ వద్దని ఆజ్ఞాపించాడు. ఆజ్ఞలు అక్షరం పొల్లు పోకుండా అమలుపరిచారు.

అయితే  బయట నుంచి రైళ్లు టాటానగరం మీదుగా వెళతాయి. వాటినిలో వ్యాధిని ఎలా అదుపు చేయాలి? మెరుపులా ఆలోచన. అలా వచ్చే రైళ్ళను పక్కమార్గంలోకి మళ్లించి, అక్కడ ఆపి, డాక్టర్లు, కార్యకర్తలు అందరూ లోపలికి వెళ్లి టీకాలు వేయించు కొని వాళ్ళను వెతికి, అందరికీ టీకాలు వేసిన తరువాతనే రైళ్లను వాటి మార్గాలలో వెళ్లటానికి అనుమతించారు. ఇంత పకడ్బందీగా ఏర్పాట్లు చేశాక  ఒక వారం పది రోజులకి కాస్త  ప్రభావం కనిపించింది.

బయటివాళ్ళవల్ల నుంచి వచ్చే మశూచి కేసులు కాస్త అదుపులో ఉన్నాయి, కొత్తరోగులు  ఎవరూ నమోదు కాలేదు.



ప్రపంచ ఆరోగ్యసంస్థ వాళ్లు కూడా ల్యారీ తీసుకున్న చర్యలను, స్ఫూర్తిని, ధైర్యాన్ని అభినందించారు. ఈ క్రమంలో రూసీ మోడితో, అలాగే టాటాతో కూడా సత్సంబంధాలు ఏర్పడ్డాయి. ఇలాంటి సంబంధాలు ఎప్పుడు ఎక్కడ ఉపయోగ పడతాయో చెప్పలేము కదా! (టాటానగర్ లో మశూచి నియంత్రణ జరిగిన 30 సంవత్సరాలకి డా.ల్యారీ మళ్ళీ శ్రీలంకలో సునామి తర్వాత సహాయచర్యలు చూడటానికి వచ్చినప్పుడు శ్రీలంకలో ఆదరించి, ఆతిధ్యం ఇచ్చింది టాటా సంస్థలే.

టాటానగర్ పరిసర ప్రాంతాల్లో మశూచిని అదుపు చేసాక టాటా గ్రూప్ వాళ్లకి డాక్టర్ ల్యారీ బ్రిలియంట్ సలహా ఇచ్చాడు. ఇక్కడకు దగ్గరలోని చోటా నాగపూర్ ప్రాంతాల్లో ఎక్కువగా అటవీ ప్రాంతాలు, పల్లెలు, గూడేలు ఉన్నాయి. అక్కడ ఇంకా మశూచి ఉంది. దానికోసం ఏమైనా చెయ్యాలి అని టాటా వాళ్ళకి వివరించాడు. ఈ ప్రతిపాదనకు వాళ్ళు తక్షణమే ఆమోదించారు. ఆ మొత్తం ప్రాజెక్టుకు కావలసిన ధనసహాయం వాళ్లే చేస్తామన్నారు.

వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ సహాయంతో, భారత ప్రభుత్వ ప్రోత్సాహంతో, టాటా వారి చొరవతో ఛోటా నాగపూర్ లో మశూచి నిర్మూలన ప్రాజెక్టును సొంతంగా మొదలుపెట్టి నడిపించారు. అది కూడా విజయవంతం అయింది. ఇంతకు ముందు చెప్పినట్లుగానే వీటన్నిటికి ల్యారీ బ్రిలియంట్ ఒక్కడే కారణం కాదు. అయినా అన్నింటిలో కూడా కీలక పాత్ర పోషించింది ల్యారీ మాత్రమే.

***'నేను నా పాత్రను పోషించాను, బృహత్తర ప్రణాళికలో వందలమంది భాగస్వాములయ్యారు'*** అని నిరాడంబరంగా అంటారు డా.బ్రిలియంట్. ఇలాంటి సవాళ్ళు, సమస్యలతో ల్యారీ పాల్గొన్న మశూచి నిర్మూలన కార్యక్రమం మరో రెండేళ్ల

పాటు కొనసాగింది భారతదేశంలో. 1976-77 వరకు ఈ క్రమంలో ఆయన ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పిన మరి కొన్ని సంఘటనల గురించి తెలుసుకుందాం.

చోటా నాగపూరు ప్రాజెక్టు జరుగుతున్నప్పుడు అక్కడ అడవుల్లో, కొండల్లో తిరగడానికి అదనపు జీపులు అవసరమయ్యాయి. ప్రాజెక్ట్ చివరిదశలో ఉంది. కష్టమైన రహదారుల్లో ప్రయాణం చేయటానికి మామూలు రెండు చక్రాలు తిరిగే టూవీల్ డ్రైవ్ వాహనాలు పనిచేయవు. వీటిలో వెనక చక్రాలను యంత్రము తిప్పుతుంటుంది. ముందు చక్రాలు ఆ ఊపుతో ముందుకు వెళుతుంటాయి. మట్టి, బురద దారుల్లో అలా కాకా నాలుగు చక్రాలూ తిరిగే విధానం, ఫోర్ వీలర్ కొందామనుకున్నారు. అలాంటి సామర్థ్యం ఇండియాలో మహేంద్రా కంపెనీ వారి జీపులకే ఉంది. ఆ పనిమీద ఢిల్లీ లో ఉన్న హెల్త్ సెక్రెటరీ గారి దగ్గరకు వెళ్ళాడు డా.ల్యారీ.

తమ అవసరాలను వివరించి, చేయవలసిన పనులను చెప్పాడు. మహేంద్ర ఫోర్ వీలర్ జీప్స్ 200 కొనాలను కుంటున్నాం, మీ అనుమతి కావాలని కోరాడు.

సెక్రటరీ అప్పుడే గుడి నుంచి వచ్చినట్టుగా ఉన్నాడు. చాలా పవిత్రంగా, పరమ భక్తునిగా, పెద్ద మనిషిలా కనిపిస్తున్నాడు. పని అయిపోతుందిలే అనుకున్నాడు ల్యారీ.



కార్యదర్శి మంచిది బాబూ, ‘మీకు మహేంద్రా జీపులు కావాలా? మహేంద్ర ఎందుకు మా కజిన్ బ్రదర్ ఫ్యాక్టరీ ఉంది. వాళ్లు స్టాండర్డ్ జీపులు తయారు చేస్తారు. వాటిని కొనండి’ అని సలహ ఇచ్చాడు.

కాని ఆయన చెప్పినవి కొండలు, గుట్టల్లో వెళ్లలేవు. అవి టూవీలర్ డ్రైవ్ లు. మహేంద్ర ఫోర్ వీలర్ కాబట్టి అలాంటివి ఉండాలి అని నిజాయితీగా చెప్పాడు. నీ పరిస్థితి నాకు అర్థమైంది బాబూ, నేను చెప్పేది కూడా నువ్వు ఆలోచించు. నా మాట విని స్టాండర్డ్ జీపులు కొంటే నాతో సత్సంబంధాలు

ఉంటాయి, లేదు, మహేంద్రా జీపులే కావాలంటే దానికి ఎంత సమయం పడుతుందో నేను చెప్పలేను' అన్నాడు.

ల్యారీకి ఇదంతా కొత్తగా అనిపించింది. అక్కడ వాళ్ళు చెప్పారు. ఆయన లంచం అడుగుతున్నాడట. ఇక్కడ గత 3-4 ఏళ్లుగా ఎన్నో కార్యక్రమాలను స్వచ్ఛందంగా, స్వచ్ఛంగా నడుపుతున్న ల్యారీకి ఒక సందేహం కలిగింది. ఏది ధర్మం, ఏది న్యాయం, ఏం చేయాలి అని మధన పడుతున్నాడు. సెక్రటరీ తన తుది తీర్పుగా, హెచ్చరికను జోడించి ఇలా చెప్పాడు. మా జీపులు అయితే 24 గంటల్లో మంజూరు చేస్తా, మీకు మహేంద్ర జీపులే, ఫోర్ ప్లే లే కావాలంటే ఎన్ని రోజులు పడుతుందో చెప్పలేను. నాకు 48 గంటల్లోగా నీ నిర్ణయం చెప్పు అని సంభాషణ ముగించాడు.

ల్యారీకి ధర్మసంకటం. నీతికి, అవినీతికి పోరాటం. అదే సమయంలో డా.ల్యారీకీ రామగోవింద అనే ఆధ్యాత్మిక గురువు కనిపించాడు. ఆయన అంతకు ముందే ల్యారీకి పరిచయం. ఆయనను కలుసుకునే సంధర్భం వచ్చింది.

ఆయన సమస్యను క్షుణ్ణంగా విన్నాడు. ల్యారీ, ఇక్కడ నిన్ను నువ్వు భూతద్దంలో చూసుకుంటున్నావు. నీ నిజాయితీ, నీ నిబద్ధతా చాలా విలువైనవే, కాదనటం లేదు. వాటన్నిటి కంటే కూడా అటువైపు వేలాది మంది మశూచి రోగుల ప్రాణాలు విలువైనవి. వాళ్ళ కోసం నువ్వుచేసే త్యాగాన్ని అవినీతి అనుకోవద్దు అని హితవు బోధించాడు. సరే ఇంకా సెక్రటరీతో తగాదా పడితే అసలుకే మోసం వస్తుంది. పోనీలే, ఆయన చెప్పిన టూవీలర్స్ నే తీసుకుని వాటిని మంచి దారులు ఉన్న పట్టణాలలో వాడుకుంటూ ఫోర్ వీలర్సును అటవీ ప్రాంతాలకు పంపించవచ్చని నిర్ణయానికి వచ్చాడు.



తన మనసుకు సర్దిచెప్పుకొని, రాజీపడి ఆయన చెప్పినవే తీసుకుంటానని చెప్పడానికి అక్కడి వెళ్ళాడు. కొత్త వార్త తెలిసింది. ఆ ముందురోజే ఆ సెక్రటరీని అవినీతి ఆరోపణల మీద మరోచోటికి బదిలీ చేశారట.కొత్తగా వచ్చిన సెక్రటరీ ఉన్నాడు. ఆయనను కలసి డా.ల్యారీ విషయం వివరించి ఫోర్ వీలర్స్ 200 కావాలి,అని విజ్ఞప్తి చేశాడు. ఆయన వెంటనే దానిదేముంది, ఆర్డర్ ఇద్దాం అని వెంటనే అనుమతి ఇచ్చాడు. కాగల కార్యం గంధర్వులే తీరుస్తారు అన్నట్లు ల్యారీ సమస్య పరిష్కారం అయింది. ఇది ల్యారీకి కొత్త అనుభవం.



*శాన్ ఫ్రాన్సిస్కోలో ఇంటర్న్ షిప్ కోసం వచ్చి విచిత్రమైన పరిస్థితుల్లో హిప్పీలతో ప్రయాణించి వాళ్లతో కలిసి పోయి భార్యతో కలిసి బాబా దగ్గరకు వెళ్లి ఆయన సూచన మేరకు ఢిల్లీలోని భారతదేశంలోని మసూచి నిర్మూలన కార్యక్రమాన్ని అమలు పరచి ఆ క్రమంలో ఆయన ఎదుర్కొన్న పరిస్థితులు, అడవుల్లో తిరుగుతూ ఆయన చేసిన సేవా కార్యక్రమాలు మాట్లాడుకున్నాం.30 సం.రాల వయసులో అమెరికాలో వైద్యుడిగా ఎంతో సౌకర్యవంతమైన జీవితాన్ని గడిపే అవకాశం ఉన్నా, దాన్ని వదులుకొని భారతదేశం వచ్చి, అక్కడి మశూచి నిర్మూలన కార్యక్రమంలో పూర్తిగా మునిగిపోయి ఏమైనా సరే ఈ భయంకరమైన వ్యాధి అంతం చూడాలి అన్న ఏకైక*

*లక్ష్యంతో పని చేసిన ల్యారీ, ఆయన భార్య గిరిజ కృషి గురించి తెలుసుకుంటే నిజమైన మానవత్వానికి అర్థం తెలుస్తుంది. నిస్వార్థం ఎన్ని అద్భుతాలు చూపుతుందో అర్థమవుతుంది.*

## ఖైదీలకు టీకాలు, టాటానగర్ దిగ్బంధం, పిమ్మటి వార్తలు

ఇలా ల్యారీ ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాల్లోని మారుమూల ప్రాంతాల్లో మశూచి నిర్మూలన కార్యక్రమ పనిలో భాగంగా అప్పుడప్పుడు ప్రపంచ ఆరోగ్యసంస్థ కేంద్ర కార్యాలయానికి వస్తుండేవాడు. అలా 1974 మధ్యలో ఒకసారి ల్యారీ ఢిల్లీ ఆఫీసులో ఉండగా, రిసెప్షనిస్ట్ ల్యారీకి కబురు చేసింది.

మిమ్మల్ని కలవటానికి ఎవరో ఒక అబ్బాయి వచ్చాడు, అమెరికా నుంచి. అని కబురు. ల్యారీకి ఆశ్చర్యమేసింది. అమెరికా నుంచి కుర్రాడు నన్ను కలవడానికి ఇక్కడ ఢిల్లీ కి ఎలా వచ్చాడు అనుకొని, సరే చూద్దాం కదా అని రిసెప్షన్ దగ్గరికి వెళ్ళాడు ల్యారీ. అక్కడ ఎవరూ లేరు. ఆమె చెప్పింది. ఇప్పుడే అతన్ని బయటకు వెళ్లి కాళ్ళుచేతులు కడుక్కుని రమ్మని చెప్పాము. అతని కాళ్లకు చెప్పులు లేవు, ఇస్తానన్నా వద్దంటున్నాడు. బట్టలు మురికిగా ఉన్నాయి. కాళ్లు చేతులు కడుక్కుంటే భోజనశాలకు తీసుకు వెళదామని అలా పంపాను. అని రిసెప్షనిష్ట్ చెపుతూ ఉండగానే ఆ కుర్రాడు వచ్చాడు. ఇందాక ఆమె చెప్పినట్లుగానే అతను విచిత్రంగా ఉన్నాడు. వివరాలు కనుక్కుంటూనే ల్యారీ ఆ కుర్రవాడిని డైనింగ్ హాల్ లోకి తీసుకెళ్ళి, భోజనం పెట్టించాడు. అతని వివరాలు అడిగాడు. అతని పేరు స్టీవ్ జాబ్స్. లే ఏరియాలో లాస్ట్ గెటాసులో ఒక వినోదక్రీడా (గేమింగ్ కంపెనీలో) పని చేస్తున్నాడు. ఆ కుర్రవాడు జీవితంలో ఏదో సాధించాలని తపన పడుతున్నాడు. కానీ మనసంతా ఏదో అశాంతి, సంఘర్షణలతో అయోమయంగా ఉంది. ఈ పరిస్థితుల్లో అతని స్నేహితుడు అతన్ని హిమాలయాల్లో ఉన్న నీబ్ కరోలి బాబా దగ్గరకు వెళితే మానసిక ప్రశాంతత లభిస్తుందని సలహా

ఇచ్చాడు. అమెరికా నుంచి చాలామంది, వివిధ కార్యక్రమాల్లో ఉన్నవాళ్లు ఆ బాబా దగ్గరికి వెళ్లి ఏదో ప్రశాంతత పొందుతున్నారు. స్నేహితుని వెంట హిమాలయాలకు వచ్చాడు.

- ❖ ప్రతి నెల, ప్రతిగ్రామాన్ని రెండేళ్లపాటు వెతికారు. అంటే మొత్తం గృహసందర్శనలు రెండు బిలియన్లు పైగా.
- ❖ ల్యారీ మశూచి కార్యక్రమంలో చేరిన తరువాత ఏడాదికి ఇండియాలో 188,003 రోగులు వచ్చారు. అందులో 31,262 మరణించారు.
- ❖ బాడుగకు జీపులు దొరక్క పోతే ఏనుగులను అద్దెకు తీసుకునే వాడు ల్యారీ.
- ❖ వేరియోలా మేజర్ లో మరణాల శాతం మూడోవంతు.
- ❖ గ్రామాలలో మశూచి సోకినా చెప్పేవాళ్లు కాదు. వెతకవలసి వచ్చేది.

స్టీవ్ జాబ్స్ అనే ఆ 19 సంవత్సరాల కుర్రవాడు అమెరికాలో చేసేది చాలా చిన్న ఉద్యోగం. భారతదేశం రావడానికి డబ్బు సంపాదించాలంటే చిన్న ఎలక్ట్రానిక్ పెట్టెలు తయారు చేసి, వాటిని అమ్మి, ఆ డబ్బుతో రాగలిగాడు. ఆ పెట్టెలను నీలిపెట్టెలు అంటారు. ఆ పెట్టెను టెలిఫోనుకు అనుసంధానము చేస్తే దూరప్రాంతాలకు ఫోన్ కాల్స్ ఉచితంగా చేసుకోవచ్చు. ఇలా చేయటం చట్టవిరుద్ధము.

ఆయన హిమాలయాల్లో ఉన్న నీబ్ బాబా దగ్గరకు వెళ్లాలి అనుకున్నాడు. అక్కడకు వెళితే తన మనసుకు స్థిమితం చిక్కుతుందని మిత్రుడు చెప్పగా వచ్చి బాబా ఆశ్రమానికి వెళ్లాడు.

కాని, దురదృష్ట వశాత్తు అప్పటికి 10 నెలల క్రితమే బాబా తన అవతారం చాలించాడు. అది తెలిసి నిరాశపడిన ఆ కుర్రవాడిని చూసి, అక్కడ ఉన్నవాళ్లు బాబూ, నీకు బాబా గురించి తెలియాలంటే ఆయనను బాగా నమ్మిన అమెరికా మనిషి ఢిల్లీలో ఉంటాడని, ల్యారీ చిరునామా ఇచ్చారు. అది చేతపట్టుకొని ప్రపంచ ఆరోగ్యసంస్థకు

వచ్చాడు. ఇంకా కొన్నాళ్లు కనీసం బాబా సంచరించిన పరిసరాల్లోనే ఉంటాను అని అక్కడకు వెళ్లాడు. అలా స్టీవ్ జాబ్స్ కు, ల్యారీకి తొలిపరిచయం జరిగింది.

తరువాత ల్యారీ చాలా కంపెనీలు, సేవాసంస్థలు స్థాపించాడు. స్టీవ్ ఎన్ని ఆటుపోట్లు, అమోఘవిజయాలు ఎదుర్కొంటున్నా ల్యారీతో పరిచయం జీవితాంతం కొనసాగించాడు.

మళ్లీ ల్యారీ విషయానికి వస్తే 1975 మే, జూన్ వచ్చేసరికి వాళ్లు మశూచి నిర్మూలన కార్యక్రమం ప్రారంభించిన రెండేళ్లకు భారతదేశంలో మశూచి దాదాపు పూర్తిగా అదుపులోకి వచ్చింది. మశూచి రోగులు రావటం పూర్తిగా ఆగిపోయింది. ఆ సమయం లోనే ఇండియాలో అత్యవసర పరిస్థితులు,బంగ్లాదేశ్ లో ముజిబూర్ రహ్మాన్ హత్య వంటివి జరిగాయి. ఇంకా ఎక్కడైనా, మశూచి రోగులు వస్తున్నారేమోనని అన్వేషణ తీవ్రంగా కొనసాగుతుంది.

బీహార్ లో ఒక బిచ్చగత్తెకు మశూచి వచ్చింది. ఆమె బంగ్లాదేశ్ నుంచి రైలులో యాచిస్తూ, బీహార్ చేరింది. ఆమెకు టీకావేసి ల్యారీ బృందం బంగ్లాదేశ్ వెళ్లింది. అక్కడ రోగులు చెదురు మదురుగా వస్తూనే ఉన్నారు. వాటికి, వాటి పరిసరాలకు తగు ఏర్పాట్లు చేసి వ్యాధిని అదుపుచేశారు.

1975 డిసెంబరులో బంగ్లాదేశ్ లో, బంగాళాఖాతంలో చిన్నద్వీపంలో ఒక రోగి ఉన్నట్లు తెలిసి, చిన్న పడవలో ల్యారీ, తన సహాయకులతో అక్కడకు వెళ్లాడు. అక్కడ రోగి మూడేళ్ల పసికందు, పేరు రహిమా బానూ. ఆ పాపకు అప్పుడే మశూచి సోకింది. ఆమెకు టీకావేసి, వ్యాధిని నయం చేసి, ఇరుగు పొరుగుకు అంటుకోకుండా రింగ్ వ్యాక్సిన్ పద్ధతిలో టీకాలు వేసి మశూచిని అరికట్టగలిగారు.

ఈ మూడేళ్ల పాప ప్రపంచంలో చివరి మశూచి రోగి. ఈమెకు వ్యారియోలా మేజర్ రకానికి చెందిన మశూచి వచ్చింది. తరువాత కొన్నాళ్లు వ్యారియోలా మైనర్ ఉన్నది. కాని భయంకర రకానికి చెందిన మశూచితో బాధపడిన చివరి రోగి రహిమా బానూ. ఆ విధంగా ప్రపంచంలో చివరి రోగికి టీకా వేయగల అరుదైన సంఘటన ల్యారీ బ్రిలియంట్ చేతుల మీదుగా జరిగింది. ఇది ప్రపంచ చరిత్రలో నమోదైన సంఘటన.

ఎందుకైనా మంచిదని మరో సంవత్సరం అప్రమత్తంగా వేచి చూసి వందకు రెండువందలు శాతం లేదని నిర్ధారించుకున్న పిమ్మట  అధికారికంగా ప్రకటించారు. దానికి గుర్తుగా ధ్రువపత్రాన్ని విడుదల చేశారు. 1980 లో భారతదేశంలో ఎక్కడా మశూచి రాలేదని ప్రపంచ ఆరోగ్య సంస్థ నిర్ధారించు కున్నది.

1980 లో మశూచిని భూగోళం మీద ఎక్కడా లేకుండా తరిమివేశారు. అది అమెరికా చరిత్రలో ఇరాక్ యుద్ధానికి ముందు వచ్చిన అతి పెద్ద ఉద్యమం. ప్రపంచవ్యాప్తంగా 150 వేల మంది, ప్రతిజాతికీ, మతానికి, సంస్కృతికి, దేశానికి  చెందిన వైద్యులు చేయిచేయి  కలిపి ఒక తల్లి పిల్లలుగా సన్నిహితంగా, ఒకరికి మరొకరు తోడుగా, ఒక వ్యాధికి విరుద్ధంగా, ఏకైక లక్ష్యంతో, ప్రపంచక్షేమం కోసం చేసిన పోరాటం.

ఢిల్లీలోని తమ కార్యాలయాన్ని మూసేశారు. ఎక్కడి వాళ్లు అక్కడకు వెళ్లసాగారు. విదేశీయులు భారంగా భారత దేశాన్ని వదలి వెళుతున్నారు.

*మూడేళ్లు ఒకటే లక్ష్యం, ఒకటే ధ్యేయంగా కలసి పనిచేశారు. భారతదేశంలోనే కాదు, భూగోళాన్ని మశూచిరహిత ప్రదేశంగా ప్రకటించ గలిగారు. దేశవిదేశాల నుంచి వచ్చిన వైద్యులు, భారతదేశపు వేలాది కార్యకర్తలు, అధికారులు, అనధికారులు, కలసి సమష్టిగా సాధించిన ఘనవిజయం అది, మశూచి నిర్మూలన. మానవజాతి చరిత్రలో*

*సువర్ణాక్షరాలతో లిఖించ దగినది, పదిలపరచవలసింది. దీనికి ప్రత్యక్ష సాక్షి, దీనిలో కీలక పాత్రధారి మనం చెప్పుకున్న ల్యారీ బ్రిలియంట్.*

ల్యారీ బ్రిలియంట్, గిరిజా బ్రిలియంట్ ఇంతవరకు వెనక్కి తిరిగి చూసుకుంటే భారతదేశంలో వాళ్ళ దొక విచిత్ర ప్రయాణం. ఎన్నో మలుపులు తిరిగి ల్యారీతో ఒక బృహత్తరమైన మానవాళి సంక్షేమ పథకాన్ని అమలు చేయించడం చాలా విచిత్రం. బాధ్యత పూర్తి చేసుకున్న పిమ్మట ల్యారీ, గిరిజ ఇద్దరూ వాళ్ళ గురువు బ్రతికుండగా ఎప్పుడో ఆయనకు మాట ఇచ్చారు ' మేము భారత దేశాన్ని వదిలి వెళ్లేటప్పుడు దక్షిణభారతదేశ ముఖ్య ఆలయాలు, ప్రధానంగా సుబ్రమణ్య దేవాలయం, దర్శించుకుని వెళ్తాం' అని.

వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ పని అయిపోయాక వాళ్ళిద్దరూ కలిసి దక్షిణ భారతదేశంలోని ప్రముఖ దేవాలయాలను అన్నిటినీ చూసుకుని, అప్పుడు అమెరికా చేరుకున్నారు. ఇన్ని సాహసాలు పూర్తిచేసేటప్పటికి ల్యారీ వయస్సు కేవలం 34 సంవత్సరాలే. ప్రజాసేవ ముఖ్యంగా, పబ్లిక్ హెల్త్ కార్యక్రమాల ప్రాముఖ్యత, ప్రాధాన్యత గుర్తించాక, ల్యారీ, గిరిజ ఇద్దరూ కూడా అప్పటి నుంచి ఇప్పటి వరకు అలాంటి కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొంటూ ఉండటం వారిద్దరి ప్రత్యేకతను తెలియజేస్తుంది.

ఇలా వాళ్లు పబ్లిక్ హెల్త్ కార్యక్రమాల్లో కొనసాగడానికి పునాదిగా, అమెరికా తిరిగి రాగానే 1978లో మిషిగాన్ యూనివర్సిటీలో పబ్లిక్ హెల్త్ లో మాస్టర్స్ డిగ్రీ చదవడానికి మళ్లీ వాళ్లు విద్యార్థులు అయ్యారు. అన్ని సంవత్సరాలు వాళ్ళు అమెరికాలో లేకపోయినా వాళ్ళు భారతదేశంలో చేసిన సేవలను గుర్తించి వాళ్ళిద్దరికీ ఆ యూనివర్శిటీ వాళ్లు ఫీజులో రాయితీ, స్కాలర్ షిప్ కూడా ఇచ్చారు. గిరిజ కూడా తన పిహెచ్. డి. పూర్తి చేసింది. ల్యారీ తన యం.యస్. పూర్తి కాగానే, పబ్లిక్ హెల్త్

ప్రొఫెసరుగా కొన్ని సంవత్సరాలు కొనసాగాడు. చాలా సౌకర్యవంతమైన ఇటువంటి అధ్యాపక వృత్తిలో స్థిరపడినట్లే ఉన్నాడు ల్యారీ.

కానీ ఆయన రక్తంలో కలిసిపోయిన మానవ సేవా దృక్పథం ఆయన్ని మరో బృహత్తర ప్రణాళిక వైపు నడిపించింది.

ల్యారీ, ఆయన భార్య గిరిజ ఇద్దరూ కలిసి ఒక సుదీర్ఘ వ్యాసం రాశారు, దాని పేరు మారణాంతకవ్యాధి.(killer disease) వ్యాసం చివర్లో ఒక వాక్యం చేర్చారు.

**'ఇలాంటి కార్యక్రమాలను మరింత ముందుకు తీసుకువెళ్లటానికి మీరు సహాయం చేయొచ్చు'** అని విజ్ఞప్తి చేశారు.

దానిని చదివిన చాలామంది ల్యారీ ఇంటికి విరాళాలు పంపించారు. కొన్ని వారాల్లోనే ఆ విరాళాల మొత్తం 20 వేల డాలర్ల వరకు చేరింది. ఆ విరాళాలతో ఏం చేయాలని ఆలోచించే క్రమంలో తన సన్నిహితులు కొందరిని, సేవాదృక్పథంగల మిత్రుల్ని తమ ఇంటికి పిలిచారు ల్యారీ, గిరిజ.

వాళ్లలో ముఖ్యమైన వాళ్ళు ల్యారీని నీబ్ కరోలీ బాబాకు పరిచయం చేసిన రామ్ దాస్. కౌంటర్ కల్చర్ సూపర్ హీరో, ల్యారీని హిప్పీలతో కలిసి ప్రయాణం చేయించిన వేవీ గ్రేవీ, ఢిల్లీలో ప్రపంచ ఆరోగ్యసంస్థలో ల్యారీని ఉద్యోగంలో నియమించిన నికో లాగ్రా సెక్ వీళ్లంతా ఉన్నారు.

ల్యారీ బ్రిలియంట్, వేవీ గ్రావీలు హిప్పీల బృందంతో కలిసి పదేళ్ల ఏళ్ళ క్రిందట నేపాల్ లో ప్రయాణించినప్పుడు, అంటే మనం మాట్లాడుకుంటున్నది1978-79 ప్రాంతాలు. అప్పటికి పదేళ్ళ
ముందు నేపాలు ప్రజలు వాళ్లను ఆదరించి నప్పుడు, ఆ ప్రజల రుణం తీర్చుకోవటానికై వాళ్లకు ఏమైనా చేయాలనుకున్నారు. 1978లో వచ్చిన 20 వేలతో

ఏం చేద్దామని వాళ్ళంతా ఆలోచించుకుంటే వాళ్ళకు అనిపించింది. సరైన సమయంలో వైద్య సదుపాయాలు అందక అంధత్వానికి లోనవుతున్న నేపాలి పేద ప్రజలకు ప్రయోజనం కలిగించే ముఖ్య కార్యక్రమంగా సేవ SEVA అనే సంస్థను ప్రారంభించారు రాందాస్, వేవీ గ్రే, వాళ్ల మిత్రబృందము అందరూ.

ఇలాంటి వాటిలో అత్యంత, అద్భుత అనుభవం గల ల్యారీ వాళ్లకి లీడర్. **సేవ** అనే సంస్థని అంధత్వ నిర్మూలనే ప్రధాన ఆశయంగా ముందుకు తీసుకెళ్దామని అందరూ నిశ్చయించుకున్నారు. ల్యారీకి అప్పటికీ నాలుగైదు సంవత్సరాల ముందు ఢిల్లీలో కుర్రవాడు పరిచయం అయ్యాడు కదా! ఆయనకి ఫోన్ చేశాడు. నూతనంగా ప్రారంభిస్తున్న సేవా సంస్థ గురించి చెప్పి, 'మీరు కూడా వచ్చి, మాతో కలిసి **సేవా** సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ గా ఉండండి' అని అడిగాడు ల్యారీ.

అతనే యాపిల్ కంప్యూటర్స్ సంస్థ యజమాని స్టీవ్ జాబ్స్. అప్పటికే ఆపిల్ కంప్యూటర్ ఒక నమూనా తయారు చేశాడు. మరొక నమూనా చేయటానికి ప్రయోగాలు చేస్తూ, తీరిక లేకుండా ఉన్నాడు.స్టీవ్ జాబ్స్ 'నేను కంప్యూటర్ల గురించిన పనులతో సతమతం అవుతున్నాను' అన్నాడు.
ల్యారీ 'ఆ కంప్యూటర్ లతో ఏం చేస్తారు మీరు? ఇలా సేవా సంస్థల్లో చేరితే బోలెడంత ప్రజా సేవ చేయొచ్చు అని చెప్పి స్టీవ్ ను ఒప్పించాలని ప్రయత్నించాడు.

కానీ జాబ్స్ 'లేదు, నేను ప్రపంచాన్ని మార్చే కంప్యూటర్ను విడుదల చేయబోతున్నాను. ఇప్పటివరకు తిరుగులేకుండా ఎదుగుతున్న ఐ.బీ.ఎం.ను జయించడమే నా లక్ష్యం. అయితే మీరు ప్రారంభిస్తున్న సేవా సంస్థకు నావంతుగా డా.5,000 డాలర్లు పంపిస్తున్నాను అని వివరాలను పంపించాడు ల్యారీకి. అంతవరకు ల్యారీ బ్రిలియంట్ కు ఒక వ్యక్తి నుంచి అందిన అత్యధిక విరాళం అదిగో అదే. స్టీవ్ జాబ్స్ నుంచి 5000 రావడం. స్టీవ్ జాబ్స్ మరో మాటకూడా చెప్పాడు. మీరు యాపిల్ కంపెనీ వాటాలు

కొనండి, మీకు బాగా లాభాలు వస్తాయి. ఆ లాభాలతో సేవా సంస్థకు మీరు ఎక్కువ విరాళాలు సేకరించ వచ్చు అన్నాడు.

ఆయన చెప్పినట్టుగానే ల్యారీ యాపిల్ లో వాటాలు కొన్నాడు. ఆ లాభాన్ని **సేవ** సంస్థకు అందించాడు. ల్యారీ బ్రిలియంట్ కు అదే రోజుల్లో ***'భారతదేశంలో మశూచి నిర్మూలన'*** అనే పెద్ద పుస్తకం (Management Of Smallpox In India) రాయడానికి ఒక లక్ష డాలర్ల గ్రాంటు కూడా వచ్చింది. వీటన్నిటి కలయికతో **సేవ** సంస్థ, పటిష్టమైన పునాదులపై నిర్మించబడింది.
మొట్టమొదటిగా వాళ్లు ప్రారంభించిన కార్యక్రమం నేపాల్లో కూడా మారుమూల ప్రాంతాలకు వెళ్లి కంటిశుక్లాల ఆపరేషన్లు చేయటం. అదే రోజుల్లో సేవ సంస్థకు అనుబంధంగా వివిధ దేశాల్లో శాఖలను ప్రారంభించటం, స్థానికంగా ఉన్న నేత్రవైద్యులతో ఒక ఒప్పందం కుదుర్చుకుని, వాళ్ల ద్వారా కూడా, తమ సేవలను అందించడం, కార్యక్రమాలుగా పెట్టుకున్నారు.

ఆ క్రమంలో వాళ్ళకి దక్షిణ భారతదేశంలో ప్రసిద్ధదేవాలయాల కూడలి, మదురై నుంచి అమెరికా పర్యటనకు వచ్చిన ఒక కంటి డాక్టర్ కలిశారు. ఆయన డాక్టర్ వెంకటస్వామి. ఆయన పరిచయం వెతకబోయిన తీగ కాలికి తగిలినట్లయింది. మధురైలో ఆయన విశ్రాంత కంటి సర్జన్. రిటైర్ అయినప్పటికీ పేదలకు కంటి ఆపరేషన్లు చేయాలని ఉద్దేశంతో ఇంట్లోనే ఒక 15 పడకలు ఏర్పాటుచేసుకున్నాడు. తనకు ఉన్న పరిమిత వనరులతో నిస్వార్థంగా సేవ చేస్తున్నాడు.

ఇప్పుడు వాళ్లతో కలిసి ఆయన మాట్లాడినప్పుడు వాళ్ళు చెప్పారు మేమూ ఇలాగే భారీ ఎత్తున సేవా కార్యక్రమాలు ప్రారంభించి విస్తరింప చేయాలనుకుంటున్నాం.ముఖ్యంగా కంటి ఆపరేషన్లు. మీరు మదురై లో ఎలాగూ చేస్తున్నారు. ఆ కార్యక్రమాలను ముందుకు తీసుకు వెళ్ళండి అని డాక్టర్ వెంకట స్వామి గారికి చెప్పారు. అలా ప్రారంభమైంది మధురైలో అరవింద్ కంటి ఆసుపత్రి సముదాయం. భారతదేశంలోనే


Larry Brilliant

కాకుండా ఇతర దేశాల్లో కూడా శాఖోపశాఖలుగా విస్తరించి, కోట్లాది మందికి ఉచితంగా కంటి ఆపరేషన్లు అతి తక్కువ ఖర్చుతో, ఇచ్చుకో గలవాళ్లకు చేస్తున్నారు. అలాంటి మహావృక్షానికి పాదుచేసి, నీరు పోసింది 1979లో ల్యారీ. వాళ్లు నేపాల్లో ఈ కంటి ఆపరేషన్లు కార్యక్రమాన్ని ప్రారంభించాలనుకున్నప్పుడు మీరు చాలా మారు మూల ప్రాంతాలకు వెళ్తున్నారు కదా! మరి అక్కడి నుంచి వివిధ ప్రాంతాల్లో సంప్రదించాలంటే మీకొక సమాచార వ్యవస్థ కావాలి. ఇదిగో నేను పంపిస్తున్నాను అని అప్పటికే ఆయన తయారుచేసిన  ఒక కంప్యూటర్ సాఫ్ట్ వేర్, డైలాన్ మోడెమ్, ఇంకా  విడిభాగాలు కూడా పంపించాడు స్టీవ్ జాబ్స్. ఉద్యోగానికి కొన్ని రోజులు సెలవు పెట్టి వీటి అన్నింటితో తన బృందంతో కలిసి నేపాల్ వెళ్ళాడు ల్యారీ.

అప్పటికి ల్యారీ దంపతులకు ఒక సంవత్సరం వయసున్న బాబు ఉన్నాడు. ఆ బాబు మొట్టమొదటి మాటలు కూడా నేపాలి భాషలోనే పలికాడట.10 ఏళ్ల క్రిందట ఎక్కడైతే దమ్ మారో దమ్ అంటూ హిప్పీలతో కలిసి తిరిగాడో, అదే దేశంలో, అదే ప్రాంతంలో ఇప్పుడు ల్యారీ బ్రిలియంట్ 1979 లో ఆపద్బాంధవుడిలా, సేవా సంస్థ సైనికుడిగా కంటి ఆపరేషన్ల కార్యక్రమాన్ని ప్రారంభించాడు. ఎంత విచిత్రంగా ఉంటుంది చూడండి జీవితం. నిస్వార్ధంతో అంకితం, ఒక దృక్పధంతో ముఖ్యంగా పని చేయాలనుకున్నప్పుడు ఒక మనిషి ఎక్కడి నుంచి ఎంత దూరమైనా వెళ్ళగలడు అనడానికి ఉదాహరణ ల్యారీ బ్రిలియంట్. మళ్లీ నేపాల్ వెళ్లి, అక్కడ 5,6 నెలలు ఉన్నారు.  ఆ సమయంలో వేలాదిమందికి కంటిశుక్లాల ఆపరేషన్లు చేయడమే కాకుండా ప్రపంచ వ్యాప్తంగా ఉన్న **సేవ** కార్యకర్తలు,  వాళ్ళ అనుబంధ సంస్థల వాళ్లతో మాట్లాడానికి స్టీవ్ జాబ్స్ పంపిన కంప్యూటర్ సాఫ్ట్ వేర్ ను బాగా గమనించాడు ల్యారీ. ఇది ఆయనలో మరో ఆలోచనకు దారితీసింది. అది మళ్ళీ ఆయన జీవితాన్ని ఇంకో గొప్ప మలుపు తిప్పింది.

ఆ మలుపు ఏమిటో తెలుసుకోవడానికి ముందు సంస్థ గురించిన మిగతా సమాచారం ఇప్పుడు చూద్దాం. అట్లా 1978-79 లో ప్రారంభమైన **సేవా** సంస్థ, క్రమక్రమంగా వ్యాప్తి చెందుతూ, ప్రస్తుతానికి అనేక దేశాల్లో విస్తరించి కంటి ఆపరేషన్ల కార్యక్రమాన్ని విజయవంతంగా గత నలభై సంవత్సరాల పైగా కొనసాగిస్తూనే ఉంది. అంతర్జాలం లోకి వెళ్లి సేవ ఆర్గనైజేషన్ అని కొడితే వాళ్ళ వెబ్ సైట్ కి వెళ్ళి, దానిని గురించి తెలుసుకో వచ్చు. ఆ సంస్థ కేంద్ర కార్యాలయం కాలిఫోర్నియాలో ఉంది. వాళ్ళ వెబ్ సైట్ లో సేవ సంస్థ ఎలా ప్రారంభించారు వంటి అనేక విశేషాలు, అలాగే ల్యారీ తో ఇంటర్వ్యూ, డాక్టర్ వెంకటస్వామి గురించిన విశేషాలు, ఇవన్నీ కూడా ఇందులో చూడొచ్చు.




సేవ అనే హారానికి దారం వంటివాడు రామదాస్. *ఎన్నో విలక్షణ మణులను కలిపి కంఠహారంగా కూర్చిన వ్యక్తి ఆయన. ల్యారీ దంపతులు సహకారంతో, 20 దేశాలలో గల 4 కోట్లమందికి పైగా చూపును పొందారు. సేవ సంస్థకు రామదాస్ సహస్థాపకుడు, శిల్పి, ఆధ్యాత్మిక ధృవతార, సేవకుడు, గురువు, మిత్రుడు. అంతేకాదు, ఇంకా విచిత్రంగా నిధుల సేకరణ నిపుణుడు కూడా. నిస్వార్థసేవకు ఉదాహరణ రామదాస్. – ల్యారీ, గిరిజ*














అరవింద్ నేత్రసంరక్షణ కేంద్రాలు దేశవిదేశాలలో నెలకొల్పబడి విజయవంతంగా పనిచేస్తున్నాయి. చెన్నయ్, ఉడమాల్ పేట, కోయంబత్తూరు, పాండిచ్చేరి, తిరుపతి వంటి పలుప్రదేశాల్లో ఇవి ఉన్నాయి.

*దృష్టి కార్యక్రమం*

*అంతర్జాతీయ ఖ్యాతి గాంచిన అరవింద్ కంటిసంరక్షణ వ్యవస్థలు*

*50 లక్షల మందికి చూపు ఇవ్వగలిగారు. గత ఒక్క ఏడాదిలో పది లక్షలమందికి ప్రపంచవ్యాప్తంగా నేత్రసేవ చేశారు.*

మళ్ళీ వెనక్కి మనం 1980లో ల్యారీ సమాచారానికి వద్దాము. అలా ఉద్యోగానికి సెలవు పెట్టి నేపాల్లో కంటి ఆపరేషన్లను సేవా సంస్థ ద్వారా విజయవంతంగా ముగించుకున్న పిమ్మట, మళ్ళీ వెనక్కు వచ్చేసి, మిషిగన్ యూనివర్సిటీలో తన అధ్యాపక వృత్తిని కొనసాగించాడు ల్యారీ. స్టీవ్ జాబ్స్ తో తరచు ఫోన్లో మాట్లాడే వాడు ల్యారీ. స్టీవ్ జాబ్స్ వచ్చినప్పుడల్లా కలుసుకుని సేవా సంస్థ గురించి తెలుసుకుంటూ

ఉండేవాడు. తాను నేపాల్ లో చూసిన ఆపిల్ కంప్యూటర్ కాన్ఫరెన్స్ ల్యారీని వదిలి పెట్టలేదు.

దాన్ని మరింతగా విస్తరించి, వాణిజ్య అవసరాలకు అనుగుణంగా వృద్ధి చేద్దామనుకున్నాడు. నెట్వర్క్ టెక్నాలజీ ఇంటర్నేషనల్ అనే కంపెనీ ప్రారంభించాడు ల్యారీ. ల్యారీని టెక్నాలజిస్ట్ అని చాలాసార్లు అనుకున్నాము గదా. సాంకేతికరంగంలో ల్యారీ వేసిన తొలి అడుగు ఇదే. ఈ కంపెనీ కొద్ది సంవత్సరాలు నడిచింది, బ్రహ్మాండమైన విజయం, విపరీత లాభాలు రాకపోయినా కంపెనీ లాభాల్లో కొంత భాగం సేవా సంస్థకు వినియోగించాడు.

మిగిలిన మొత్తాన్ని WELL అనే ఎలక్ట్రానిక్ లింక్ గా మొట్ట మొదటి కమ్యూనిటీని స్థాపించాడు. ల్యారీ మెడిసిన్ చదివి, భారతదేశంలో పని చేసి, మళ్ళీ ఇక్కడికి వచ్చి కంటి ఆపరేషన్లు చేసి, టెక్నాలజీ రంగం లోకి వెళ్లి ఆన్ లైన్ డిజిటల్ కమ్యూనిటీని ప్రారంభించాడు. అయితే తాను పక్కన ఉండి, బ్రాండ్ అనే వ్యక్తిని ముందుంచి, ఆన్లైన్ కమ్యూనిటీని నడిపించాడు. ఒక విధంగా చెప్పుకోవాలంటే ఇప్పుడు మనం వాడుతున్న ఫేస్ బుక్ లాంటి సోషల్ నెట్ వర్కింగ్ కి ఒకప్పటి మాతృకగా దీనిని అనుకోవచ్చు.

ఆ కంపెనీ పదేళ్లపాటు నడిచింది. అప్పట్లో ఈ వెల్ WELL online Community లో వివరాలు తెలుసుకోవచ్చు. దీనిని ప్రపంచంలో అత్యంత ప్రభావాన్ని చూపగల వ్యవస్తగా ప్రశంసించాయి పత్రికలు. తర్వాత రకరకాల చేతులు మారిన కంపెనీ ఇప్పటికీ పనిచేస్తుంది.

*ఎన్ని మలుపులు తిరిగినా, తన లక్ష్యాన్ని, మార్గాన్ని విడవకుండా కొనసాగటం, విశ్వమానవ శ్రేయస్సుకే కృషి చేయటం ఇంతగా సాధ్యము అవుతుందా అనే ప్రశ్నలకు ల్యారీ జీవితంలో అనేక జవాబులు కనిపిస్తుంటాయి.*

భారతదేశం లోని మధురై నుంచి అమెరికా పర్యటనకు వచ్చిన ఆయన పేరు డాక్టర్ వెంకట స్వామి, డాక్టర్ గోవిందప్ప వెంకటస్వామి. పర్యటనలో అమెరికా వస్తే ఆయన పరిచయం అయ్యాడు. ల్యారీ వాళ్ళు నేపాల్లో ఈ కంటి ఆపరేషన్లు కార్యక్రమాన్ని ప్రారంభించాలని అనుకున్నప్పుడు మీరు చాలా మారుమూల ప్రాంతాలకు వెళ్తున్నారు కదా? మరి అక్కడి నుంచి వివిధ ప్రాంతాల్లో ఉన్న ఒక సమాచారం కావాలి సాఫ్ట్ వేర్ కూడా పంపించాడు స్టీవ్ జాబ్స్. ఉద్యోగానికి సెలవు పెట్టి తన బృందంతో కలిసి వెళ్ళాడు ల్యారీ. తాను గతంలో తిరిగిన అదే దేశంలో, అదే ప్రాంతంలో ఇప్పుడు 1979లో ' ఆపద్బాంధవుడు సేవా సైనికుల కార్యక్రమం' ప్రారంభం చేశారు.

ఆ పరికరాలను గమనించిన ల్యారీ ఆలోచనలు కొత్త దారులు తొక్కాయి. అవి మన జీవితాలను మలుపు తిప్పాయి. 1978-79 దేశాల్లో విస్తరించిన కంటి ఆపరేషన్ల కార్యక్రమాన్ని విజయవంతంగా గత నలభై సంవత్సరాల పైగా కొనసాగిస్తూనే ఉంది. మీరు ఇంటర్నెట్ వెళ్లి వెళ్లి కాలిఫోర్నియా డైరెక్టరీలో విశేషాలు, ల్యారీతో ఇంటర్వ్యూ, డాక్టర్ వి. వెంకటస్వామి విశేషాలు, రైలు సమాచారం నేపాల్ లో కంటి ఆపరేషన్లు చూడవచ్చు. సేవా కార్యక్రమాన్ని విజయవంతంగా ముగించు కొని మళ్ళీ వెనక్కి వచ్చి యూనివర్సిటీలో తన అధ్యాపక వృత్తిని కొనసాగించాడు.

స్టీవ్ జాబ్స్ ఆపిల్ కంప్యూటర్ మరింతగా విస్తరించి దాన్ని వాణిజ్యపరంగా చేద్దామనుకుని నెట్వర్క్ టెక్నాలజీ ఇంటర్నేషనల్ అనే కంపెనీ ప్రారంభించాడు. స్నేహితులను మరింత ముందుకు తీసుకెళ్లడం అనే కార్యక్రమాలు అనుకున్నాం కదా. ఒక వ్యక్తి, ఒక డాక్టరుకు నెట్వర్క్ రంగంలో బ్రహ్మాండమైన విజయం సాధించడం, ఈ విధంగా లాభాలు రావడం ఇలాంటిది గతంలో జరగలేదు. లాభాలను కొంత సేవాసంస్థకు వినియోగించి మిగిలిన దానితో డబ్ల్యూ ఈ ఎల్ ఎల్ ఎర్త్ ఎలక్ట్రానిక్ లింక్ WELL అనే మొట్టమొదటి టెక్నాలజీ ఆన్ లైన్ డిజిటల్ కమ్యూనిటీ

ప్రారంభించాడు. అది ఇప్పుడు మనం వాడుతున్న ఫేస్ బుక్ లాంటి సోషల్ నెట్ వర్కింగుకి ప్రారంభం అనుకోవచ్చు. దానిని వెనకనుండి నడిపించింది ల్యారీ.



*స్టీవ్ జాబ్స్ సాధించిన విజయం అతని మేధస్సు వల్ల కాదు, సామర్థ్యము వల్ల కాదు, అతను సాధించింది అంతా ప్రేమ ద్వారానే. అందుకే అతన్ని చివరిసారిగా చూడటానికి గుంపులు, గుంపులుగా వచ్చారు ప్రజలు. ఒక పరికరాన్ని తయారు చేస్తున్నపుడు ప్రేమగురించి మాట్లాడటం హాస్యాస్పదంగా ఉంటుంది. కాని స్టీవ్ తన పనిని ప్రేమించాడు. తాను ఉత్పత్తి చేసిన పరికరాలను ప్రేమించాడు. దానిని మనం పసిగట్ట వచ్చు. ఆయన తన ప్రేమను ఇనుము, ప్లాస్టిక్ ముక్కల ద్వారా పంచాడు.*

1985 నుంచి 89 వరకు ఈ వెంచర్ సాగింది. కాకపోతే ఆయన ఏ వెంచర్ చేస్తున్నా, దేనిలో లాభాలు వచ్చినా, అవన్నీ తీసుకెళ్లి మళ్లీ 'సేవ' అనే సంస్థలోనే పెడుతున్నాడు.

దాని ద్వారా కార్యక్రమాలు కొనసాగుతూనే ఉన్నాయి. 1989లో తన నివాసాన్ని మిషిగాన్ నుంచి బే ఏరియాకు శాన్ ఫ్రాన్సిస్ కో దగ్గర్లో ఉన్న మిల్ వ్యాలి అనే ప్రాంతానికి మార్చాడు.

ల్యారీ కాలిఫోర్నియా వచ్చేసరికి ఆయనకు ముగ్గురు పిల్లలు.పెద్దబ్బాయి పేరు జోసెఫ్ సేవా బ్రిలియంట్. అమ్మాయి పేరు శారద. మధ్య అబ్బాయి జనార్ధన్. ఈ రెండో అబ్బాయి చాలా చిన్న వయసు, పాతికేళ్ళకే క్యాన్సరుతో చనిపోయారు. పిల్లల పేర్లలో ఇలా ***సేవ, శారద, స్కంద*** అనే పేర్లను చేర్చటం ల్యారీని ఒకప్పటి హిమాలయజీవితం ఎంతగా ప్రభావితం చేసిందో తెలియజేయడానికి ఒక ఉదాహరణ.

నివాసం మార్చిన రోజుల్లోనే ల్యారీ తమ్ముడు డ్యారీ అన్నయ్యను ఇలా అడిగాడు. అన్నయ్యా నాన్న చనిపోయి నప్పుడు నా వయసు 19 సం.రాలు. నేను అప్పుడు చదువుకుంటున్నాను. నువ్వేమో హిప్పీలతో కలసివెళ్లావు. నాన్న ఉండగా కొన్ని అప్పులయ్యాయి. తరువాత నాకు కొన్ని అప్పులు అయ్యాయి. అవీ, ఇవీ కలసి తడిసి మోపెడు అయ్యాయి.



అప్పుడు ల్యారీ తమ్ముడి కోసం ఒక కొత్త కంపెనీ నెలకొల్పాడు.
ఫోన్ కాలింగ్ రికార్డ్ వ్యాపారం బాగా జోరుగా సాగుతోంది. కంపెనీ పేరు కలర్ కార్డ్స్. దాదాపుగా ఎనిమిది తొమ్మిది సంవత్సరాల పాటు ఆ కంపెనీల ద్వారా వచ్చిన ఆదాయంతో తమ్ముడికి సహాయం చేయగలిగాడు ల్యారీ. 1998 వచ్చేసింది. సిలికాన్ వ్యాలీలో మరో అడుగు ముందుకేశాడు ల్యారీ. శాన్ ఫ్రాన్సిస్కో లో ఒక యువకుడు టెక్నాలజిస్ట్ సాఫ్ట్ నెట్ అనే కంపెనీ 1998లో పెట్టాడు. దాని వ్యాపారం టెక్నాలజిస్టుగా ఇతర దేశాల్లో షాపింగ్ కాంప్లెక్సులను ఏర్పాట్లు, ఇంటర్ నెట్ సేవలు అందించడం ప్రధాన ఉద్దేశం.

ఆ సాఫ్ట్ కేర్ ను మరింతగా ముందుకు తీసుకెళ్ళే దిశలో ల్యారీని ముఖ్య కార్యనిర్వహణాధికారిగా ఆహ్వానించారు ఆ కుర్రవాళ్లు. ల్యారీ కంపెనీ స్టాకు విలువలు బాగా పెరిగే లాగా, దాదాపు 500 మంది ఉద్యోగస్తులు పనిచేసే స్థాయికి తీసుకెళ్లారు. మూడు, నాలుగేళ్లు ఆ కంపెనీలో ఉన్నాడు ల్యారీ. ఆ కంపెనీలో చేరగానే రిసెప్షన్ దగ్గర నిలువెత్తు విఘ్నేశ్వరుని విగ్రహాన్ని ప్రతిష్ఠింప జేశారు. ఈ కంపెనీ కొంచెం ముందుకెళ్ళే దశలో సిస్కో, నోకియా, లాంటి పెద్దపెద్ద కంపెనీలు తమ రోటర్స్ తో ఇంటర్నెట్ రంగంలోకి భారీగా దిగేసరికి సాఫ్ట్ నెట్ వాటితో పోటీపడి ఉండలేక వెళ్ళి పోయింది.

ల్యారీ 2002 ప్రాంతాల్లో ఆ కంపెనీ నుంచి బయటకు వచ్చారు. ఆ తరువాత రెండేళ్లకు ఏ.టి. అండ్ టి., ఐ.పీ.ఎం., ఇంటెల్ అను మూడు కంపెనీలు కలిసి ప్రారంభించారు. కోమెటా నెట్వర్క్ అది. ల్యారీ ఆ కంపెనీకి సారథ్యం వహించాడు. విచిత్రం ఏమిటంటే ఉద్యోగాలు చేసేటప్పుడు కూడా, ఏ కంపెనీలో, ఏ పదవిలో ఉన్నప్పటికీ, కింద ఉన్న వాళ్లకి ఎవరికైనా వైద్యసేవలు అవసరం అయితే వాటిని కూడా అందించేవాడు. **సేవా** సంస్థకు తన ఆర్థికసహాయాలు కొనసాగిస్తున్నాడు ల్యారీ.

ల్యారీ గురించి ఒకపత్రికావ్యాసంలో ఇలా రాశారు. ల్యారీని మించిన వారు, విజయవంతమైన వారు టెక్నాలజిస్టుల్లో ఉండవచ్చు, సంపాదనలో ఆయనను మించినవాళ్లు ఉండొచ్చు, కాని ఆయనంతగా మానవతావిలువలు గలవారు చాలా తక్కువ. ల్యారీ ఒకసారి ఇంటర్వ్యూలో ఇలా చెప్పాడు:

కంపెనీ ఉద్యోగి, వినియోగదారుడు, పోటీదారు, మేనేజరు ఇలాగా వ్యక్తి స్థాయిని, హోదాను బట్టి గౌరవించటం నాకు ఇబ్బందిగా ఉంటుంది. ఎవరినైనా సరే ఒక మనిషిగా చూడడం మొదలు పెట్టినప్పుడు నాకు చాలా సమస్యలకు పరిష్కారాలు కనిపించాయి.

*టెక్నాలజీ కంపెనీలలో పని చేసే వాళ్ళు అందరూ ఆలోచించదగిన విషయం ఇది.



ఆసియా ఖండంలో అనేక దేశాల్లో లక్షలాది మందిని పొట్టన బెట్టుకున్న సునామీ ప్రళయం మీకు గుర్తుండే ఉంటుంది.

ల్యారీ జీవితంలో మరో దశకు వెళుతున్నాము మనం. సునామీ సహాయానికి లక్ష డాలర్లు విరాళాలు వసూలు అయ్యాయి. మళ్లీ ప్రపంచ ఆరోగ్య సంస్థతో కలసి పని ప్రారంభిస్తే చాలా సమయం పడుతుందని తానే స్వయంగా విరాళాలు సేకరించాడు.



శ్రీలంకకు వెళ్లి ఒకవైపు వైద్యుడిగా, మరొకవైపు దాతగా, ఇంకోవైపు స్వచ్ఛందసేవకునిగా సేవలందించాడు డాక్టర్ ల్యారీ.

ఆ సమయంలోనే ప్రపంచఆరోగ్యసంస్థ వాళ్లు ల్యారీని ఎలాగూ అంత దూరం వెళ్లారు కదా, భారతదేశం వెళ్లి పోలియో నిర్మూలన కార్యక్రమాలు ఎలా జరుగుతున్నాయో అధ్యయనం చేసి రమ్మని అక్కడికి పంపించారు. భారతదేశంలో ఇంకా ఏం చేయొచ్చు?

ఎన్ని పనులు చేస్తున్నప్పటికీ మొట్టమొదట్లో తాను పాల్గొన్న భారతదేశంలోని మసూచి నిర్మూలన కార్యక్రమం, తద్వారా తాను సంపాదించిన అనుభవం,

నేర్చుకున్న పాఠాలను మానవాళి సంక్షేమానికి ఇంకా బాగా ఎలా ఉపయోగించు కోగలం అని ఆలోచించే వాడు ల్యారీ. దాని ఫలితంగా 2005లో ఈ శ్రీలంక సునామి పర్యటన అయ్యాక పాన్ డిఫెన్స్(PAN DEFENCE) అనే సంస్థను ప్రారంభించాడు.

దాని ప్రధాన ఉద్దేశం ప్రపంచంలో ఎక్కడ, ఏ మూలనైనా, కొత్త అంటువ్యాధి కనపడితే వీలయినంత త్వరగా దానిని గుర్తించటం, దాన్ని అదుపులోకి తీసుకురావటం. ఇప్పుడు వచ్చిన కరోనా వైరస్(కోవిడ్-19) లాంటివి. ఇది డిఫెన్స్ సంస్థ ప్రధాన ఉద్దేశం. దానికోసమని ఒక వెబ్ కాలింగ్ వ్యవస్థను తయారుచేసి ప్రపంచవ్యాప్తంగా తత్సంబంధమైన వేలాది అధికారులకు వాళ్ల ప్రదేశాలలో ఎక్కడ, ఏ అనుమానం వచ్చినా, సమాచారం అందుతుంది. స్థానిక అధికారులకు వాళ్ల ప్రదేశంలో ఏ కొంచెము తేడా వచ్చినా అత్యవసరరోగులు ఎక్కువగా చేరుతున్నా, ఆ వార్డుల ముందు వాహనాల పార్కింగు మామూలు కంటే అధికంగా ఉన్నా అలాంటి హెచ్చరికలు అక్కడ ఏదో అసాధారణ స్థితి ఉన్నదని తెలియజేస్తాయి. ప్రమాదాన్ని ఎంత త్వరగా గుర్తిస్తే వ్యాధిని అంత త్వరగా పసిగట్ట వచ్చు.

ప్రఖ్యాత గూగుల్ సంస్థ 2006 లో గూగుల్. ఆర్గ్ అనే ధార్మిక సంస్థను ప్రారంభించారు. దానిని నడిపించగల సమర్థుడికోసం వెతుకుతుండగా ల్యారీ వాళ్లకు దొరికాడు. టెక్నాలజీ, సేవా కార్యక్రమాల్లో అనుభవం, వాటిని విజయవంతంగా అమలు పరచిన దాఖలా అన్ని అర్హతలుగల ల్యారీని గూగుల్.ఆర్గ్ కు మొదటి మేనేజిమెంట్ డైరక్టర్ గా పిలిచి పీటవేశారు.

ఎక్కడి ప్రయాణం! డెట్రాయిట్ లో మొదలైన ప్రయాణం ఎన్ని మలుపులు తిరుగుతుంది?

2009 నుంచి స్కోల్ స్థాపించిన ఈ - బే అనే మరో ప్రముఖసంస్థ గ్లోబల్ థ్రెట్ క్రైసిస్ ఫండ్ కు చైర్మన్ గా పగ్గాలు చేతబట్టాడు. ప్రస్తుతం ల్యారీ అందులోనే కీలకపదవిలో కొనసాగుతున్నాడు. సేల్స్ ఫోర్స్ అనే సంస్థలో డైరక్టర్ల బోర్డు సభ్యుడు కూడా. అంటు వ్యాధుల నివారణ, పర్యావరణ పరిరక్షణ, తూర్పు మధ్య ప్రాంత రాజ్యాల సమస్యల పరిష్కారం వంటి సమస్యల గురించి చురుకుగా పని చేస్తున్నారు.

అమెరికాలో ఎబోలా వైరస్ ఉపద్రవం వస్తే ఆ దేశ అధ్యక్షుడు ఒబామా ల్యారీని సంప్రదించి, కార్యక్రమాలను రూపొందించాడు. ల్యారీ బ్రిలియంట్ కు ఇలాంటి సాంక్రమిక వ్యాధులను అదుపు చేయగల విజ్ఞానం, అనుభవం, సత్తా ఉన్నాయి కనుకనే దేశాధ్యక్షుడు ఒబామా డా.ల్యారీని కలిశాడు.

ఒకటా, రెండా? ఎన్ని చెప్పినా చాలా తక్కువే. ల్యారీ బ్రిలియంట్ ఇప్పటివరకు చేపట్టిన కార్యక్రమాలన్నీ ప్రపంచ మానవాళి అభ్యుదయం కోసమే. ప్రపంచాన్ని మార్చేవాళ్లు, పరిరక్షించాలనుకునే వాళ్లు కొంతమంది. ల్యారీ ఆశయం ప్రపంచాన్ని మార్చటమే కాదు, పరిరక్షించటం, భూగోళాన్ని మానవాళి సుఖంగా బ్రతకగల ప్రదేశంగా చేయటం కూడా. దానినే ముఖ్యమేనని నమ్మి, ఆ త్రోవలో ప్రయోగాలు, ప్రయత్నాలు చేస్తున్న వ్యక్తి ఆయన.

శాన్ ఫ్రాన్సిస్ దగ్గరి మిల్ వ్యాలీ లో ల్యారీ కుమార్తె శారద, అమ్మ, నాన్నలతో ఉంటుంది. ఇల్లు ప్రశాంతంగా చుట్టూ చెట్లతో, ఒక ఆశ్రమం లాగా ఉంటుంది.

కాళీయమర్దనము, నటరాజు వంటి చిన్న విగ్రహాలు అక్కడ ఉంటాయి. ఒక రాతి అరుగు మీద ఆయన విశ్రాంతిగా కూర్చొని ఉంటాడు. ఇదంతా ల్యారీ జీవితానికి సంక్షిప్తరూపం. లోతుల్లోకి వెళితే ఆసక్తికరంగా, స్ఫూర్తిదాయకంగా ఉంటుంది. ఒక వ్యక్తి జీవితంలో ఇన్ని విచిత్ర మలుపులు ఉంటాయా? ల్యారీ ఇంత ప్రముఖుడైనా ఆయన గురించి పత్రికా వ్యాసాలు, ఇంటర్వ్యూలు వంటివే వచ్చాయి కాని సమగ్ర సమాచారం అందుబాటులోకి రాలేదు.

అభిమానులు, స్నేహితులు వత్తిడి చేయటంతో, ఇప్పటికి మూడేళ్ల క్రితం తన జీవిత విశేషాంశాలతో ఒక పుస్తకం రాశాడు. బ్రిలియంట్ అంటే తెలివైన, చురుకైన అని అర్థం. అది వాళ్ల ఇంటిపేరు. ఆయన వ్యంగ్యంగా నేను అన్నిసార్లూ గొప్పవాడిని కాదు అని అర్థం వచ్చేలాగా ' Sometimes Brilliant' అని పుస్తకం పేరు పెట్టాడు.

యూ ట్యూబులో ల్యారీ కార్యక్రమాలు, వాటి వివరాలు తెలుసుకోవచ్చు.



సౌజన్యము. కౌముది. ల్యారీ సూక్తులు

- ❖ గురువుల్లో గల గొప్పతనం ఏమిటంటే వాళ్లు ప్రతివాళ్లూ నిన్ను ప్రేమించేలాగా చేయరు, నువ్వు ప్రతి ఒక్కరినీ, అందరినీ ప్రేమించేలాగా చేస్తారు.

- ❖ నేను రోజుకు వంద పొరపాట్లు చేస్తాను. నేను అలా ఉన్నాను, ఉంటున్నాను, అలాగే కొనసాగుతాను. దాదాపు ప్రతి విషయంలో పొరపాటు చేస్తాను.

- ❖ పరలోకసంబంధ, మత సంబంధ కోణాలనుంచి మన రాజకీయ సంభాషణలను కొనసాగిస్తే అవి నిస్సారంగా ఉంటాయి. విలువలు, మతానికి చెందని ప్రశ్నలు కేవలం ఉపరితలాన్నే స్పృశిస్తాయి.
- ❖ మొత్తం మీద జీవితం అంటే ఏమిటి? భగవంతునితో మనకు ఉన్న సంబంధం ఏమిటి? ఇవీ ముఖ్యప్రశ్నలు.

❖ మనలో ఒకరితో మరొకరికి, ఒకరితో సమాజానికి గల బాధ్యతలు ఏమిటి? ముందు ఆ ప్రశ్నలకు జవాబులు చెప్పకపోతే తరువాతి వాటిలో ఆసక్తి ఉండదు.

❖ స్టీవ్ జాబ్స్ సాధించిన విజయం అతని మేధస్సు వల్ల కాదు, సామర్థ్యము వల్ల కాదు, అతను సాధించింది అంతా ప్రేమ ద్వారానే. అందుకే అతన్ని చివరిసారిగా చూడటానికి గుంపులు, గుంపులుగా వచ్చారు ప్రజలు. ఒక పరికరాన్నితయారు చేస్తున్నపుడు ప్రేమగురించి మాట్లాడటం హాస్యాస్పదంగా ఉంటుంది. కాని స్టీవ్ తన పనిని ప్రేమించాడు. తాను ఉత్పత్తి చేసిన పరికరాలను ప్రేమించాడు. దానిని మనం పసిగట్టవచ్చు. ఆయన తన ప్రేమను ఇనుము, ప్లాస్టిక్ ముక్కల ద్వారా పంచాడు.

❖ గూగుల్. ఆర్గ్ లో ఒక శాతం మూలనిధి, ఒక శాతం లాభాలకు తోడు ఒక శాతం వ్యక్తులు కూడా కలుస్తారు. ఇక్కడ డబ్బు అతి ముఖ్య సంపద కాదు, వ్యక్తులు గొప్పసంపద.ఒక్క శాతం మనుషులు అంటే ప్రపంచంలో చురుకైన వాళ్లలో 60 – 70 మంది. వాళ్లు ప్రపంచంలో ఉన్న అతిపెద్ద సమస్యల్లో కొన్నిటిని పరిష్కరించటానికి ప్రయత్నిస్తారు.

❖ స్వాములకు జీవితం ఏదో యాదృచ్ఛికంగా వచ్చింది కాదు. వాళ్లు జీవితాన్ని నేను ఎప్పుడైనా  చూచినంత కంటే ఇంకా ఎక్కువ లోతులకు వెళ్లి చూసి ఆనందించారు. ఒకప్పుడు నేను ఉగ్రవాదిని, వామపక్ష ఆలోచనలు గల

వాడిని. కానీ, భారతీయులను కలిసిన తర్వాత గుర్తించగలిగాను. వామపక్షమో, మరో పక్షమో అనేవి అంత ముఖ్యమైనవి కావు, హృదయము, ఆత్మలే ముఖ్యమైనవి.

❖ నీకు పైకి కనిపించే బాహ్యసంబంధాల ఆధారంగా మంచి,చెడు అనే తీర్పులు చేస్తూ ఉంటే నువ్వు చూసే ప్రపంచం చాలా చిన్నదై పోతుంది.

❖ నీకు ఒక పెద్ద సమస్య ఉన్నది. నీతో పాటు సరైన వ్యక్తులు ఉంటే సాధారణంగా పరిష్కారమార్గం దొరుకుతుంది. చేయవలసిన పనిని చేస్తావు.

❖ నన్ను నేనొక గొప్ప మేనేజరుగానో, నాయకుడిగానో అనుకోవటం లేదు. నేను ఉన్న పదవుల్లో ఉండగలగటం చాలా అదృష్టం. నేను చాలామందిని కలుసుకుంటున్నాను, చాలా కంపెనీలను పెంచాను. పెద్ద సంస్థల్లో ప్రధాన అధికారులను కలుసుకుంటున్నాను. వాళ్లు తమకు ఎంతో తెలుసను కుంటున్నారు. కాని వాస్తవానికి వాళ్లు ఆచరించే దానికి పొంతన లేదు.

❖ భూగోళంపై తాపం పెరగటం ఎక్కడో దూరాన ఉన్నవాళ్లకో, మనకు అసలు తెలియని వాళ్లకో జరిగే ప్రమాదం కాదు. అది మానవాళికి అంతటికీ, అందరికీ ఒకేసారి జరిగేది.

❖ సాధారణ వ్యక్తులు అసాధారణ విషయాలను చేసినప్పుడు మార్పు రావటం ఆరంభం అవుతుంది. అసాధారణతకు మార్గం ఎవరైనా, ఎప్పుడైనా వెళ్లటానికి సిద్ధంగా ఉంటుంది.

- "నా దగ్గర సూదులు, కుట్లు వేసే దారాలు ఉన్నాయి. వాటిని మత్తు కలిగించే వాటిగా చేసే మార్గం లేదు. శస్త్రచికిత్స చేసినంత సేపు చాలా నొప్పి కలిగిస్తాయి. ముగిశాక వాళ్లు ఇద్దరూ నాకు ఎంతగానో ధన్యవాదాలు చెప్పారు. ఓమ్ మణి పద్మోహమ్ అన్నారు.

- నీకొక పెద్ద సమస్య ఉంది. నీ దగ్గర సమర్ధవంతమైన వ్యక్తులు ఉన్నారు. సాధారణంగా పరిష్కారము లభిస్తుంది. చేయవలసిన పనేదో అదే చేస్తావు. నన్ను నేను ఒక మంచి మేనేజరుగా, మహానాయకుడిగా అనుకోను. నేను ఉన్న పదవుల్లో ఉండగలిగినందుకు నేను ఎంతో అదృష్టవంతుడిని. నేను చాలా వ్యాపారసంస్థల్లో ఎదిగాను, చాలా మందిని కలుస్తుంటాను. చాలామంది ప్రధాన కార్యనిర్వాహక ఉద్యోగులను కలుస్తుంటాను. నాకు ఆశ్చర్యము వేస్తుంది, వాళ్లకు ఎన్నో విషయాలు తెలిసినట్లు అనిపిస్తుంది. కాని వాళ్లు చేసే పనికి తెలిసిన జ్ఞానానికి పొంతన ఉండదు. ల్యారీ

- నేను సేవ సంస్థ కార్యక్రమాల్లో లీనమైనప్పుడు, బాధల్లో గల వారికి సేవాకార్యక్రమాల్లో పాల్గొంటుంటే నా బలం వెయ్యి రెట్లు పెరిగినట్లు అనిపిస్తుంది. ఈ బృంద సభ్యులకు అంతటి అసాధారణ నైపుణ్యాలు ఉన్నాయి. మేము చేస్తున్న కార్యక్రమాలు శాస్త్రీయంగా క్లిష్టమైనవి, ఆర్ధికంగా పెద్దవి, మానవహృదయాలతో ముడిపడి ఉంటాయి. రామదాస్.